# ప్రపంచ వైద్య చరిత్ర మొదటి భాగము -16 వ్యాసాలు

సేకరణ,వివరణ,రచన – వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి





Hygieia by Alexander Handyside Ritchie, College of Physicians, Queen Street, Edinburgh

1st-century Roman statue of the goddess Hygieia

1 వైద్య రంగము దాని పునాదులు 16-5-24

వైద్య విధానాలను ఒక శాస్త్రముగా మార్చి విస్తృతముగా అధ్యయనము చేసిన వారు - రోమన్లు . చైనా , ఇండియా , మరియూ ఈజిప్ట్ దేశాల వారు

ఈనాడు మనకు లభిస్తున్న మందులు వైద్యము వంటి వాటికి మూల కారణమైన వైద్య రంగపు పునాదులు అతి ప్రారంభ దశలో, ఎలా వున్నవి ? అనేది ముందు తెలుసుకుందాము .

కాలికి వేలి కి తగిలిన గాయాలనుండి రక్తము రావటాన్ని చూసి , చూసి శరీరములో యెర్ర రంగు ద్రవము వున్నదని , ముక్కుల నుండి కారే జలాన్ని చూసి - మనిషిలో ఎదో జిగట పదార్ధము వున్నదని , మూత్రమును చూసి శరీరములో నీరు ఒక భాగమని , మల విసర్జన చూసి - మనిషి తిన్న దానిలోనుంచి వంటిని గట్టి పరిచాక మిగిలిన పదార్ధము తుక్కుగా బయటకు వస్తున్నదని- అంటే మనిషిలో గట్టి పదార్ధము ఎదో నిలువ ఉంటూ వున్నది అని

ఊహించారు .   ఆ రకంగా మనిషి శరీరము అంటే ఈ మూడు పదార్ధాల కలయిక  {నీరు,  రక్తము , పదార్ధము} అనే విషయాన్ని గ్రహించారు .  రోమన్లు ఈ ఆలోచనలు మొదటి సారిగాగ్రంధస్తం చేశారు .  ఒక తరము చే  గ్రంధస్తం చేయ బడ్డ ఆలోచనలు ఉంటేనే - అదేవిషయము మీద మరొక తరము మరో  ఆలోచన చేయ కలుగుతుందని గుర్తించి - శాస్త్రములు రూపొదించిన వారు కూడా రోమనులే. మానని గాయము నుండి -  రంగు మారిన రక్తము రావటము చూసి  ,   ముక్కు లోనుండి వచ్చేద్రవాలు మొదట తెల్లగా ఉండి ఆపై పసుపు రంగులోకి మారటాన్ని చూసి   , మూత్రవిసర్జన ద్వారా  వచ్చే నీరు కూడా రంగులో రావటాన్ని చూసి  , అలాగే మలము కూడా పసుపు రంగులో కాకుండా నల్ల రంగులో రావటాన్ని చూసి - ఈ రంగులలో ని మార్పే రోగం అంటే అని నిర్ధారణ చేసుకున్నారు .

శరీరము విసర్జించే  పదార్ధములకు --రంగులకు --ఆరోగ్యానికి ఎదో సంభందం వున్నదని  కనిపెటినాకా . మారిన రంగులను రోగానికి గుర్తుగానూ ,అవి తిరిగి మామూలు రంగులలోకి మారేటట్లు చేయటమే వైద్యము గానూ చెప్ప బడుతూ మొదటితరపు  వైద్యము  పురుడు పోసుకుంది  .

రోమన్లు ప్రతి దానికి ఒక దేవీ /దేవత రూపము కల్పించే అలవాటు వున్నవారు . అందువల్ల వీరు శరీరమునకు వచ్చే నెప్పులు -- ఆరోగ్యము అనే దేవత చేసే ఏడుపులు అన్నారు . అట్లాగా ఆరోగ్య దేవత,ఆమెకు నైవేద్యంగా ప్రేత్యేక ఆహారము , ఆమె శాంతి కోసం పూజలు పుట్టినవి . ప్రత్యేక ఆహారమే క్రమంగా మందు అయ్యింది . నోటిలోనుండి వెళ్ళేది ఏదయినా ఆహారమే అనుకుంటే మందు కూడా ఒక ఆహారమే అంటే చక్కగా సరిపోతుంది .

శరీరము స్రవించే ద్రవాలను తిరిగి మామూలు రంగులోకి తేవటం మరియూ ఆరోగ్య దేవత చేత ఏడుపు మానిపించటం -అనేవి కేవలము నోటిలోకి పోయే ఆహారము ద్వారా మాత్రమే సాధ్యము అని గ్రహించి - ఆరోగ్యము కోసము ప్రత్యేక ఆహారము= మందులు యొక్క ప్రాధాన్యతను గుర్తించారు .{అనగా ఆరోగ్యము కోసము పూజలు, మంత్ర తంత్రాలకి వున్నా విలువని తగ్గించారు} . ఇప్పుడు మనము, మనలో ఉన్న ఆరోగ్యదేవత చే ఏడ్పు మాని పించటానికి అని మందులు మింగుతూ వున్నాము అని చెప్పుకోవాలి .

తరువాతి దశలో - మొత్తము మీద శరీరములో ఉన్న పదార్థాలు అన్నీ కూడా , వేటికవి గానూ - కలిసి పోయి

వున్నపుడు కూడా  ఉండాల్సిన మోతాదు ఎదో ఒకటుందని ఉందని గుర్తించారు . ఈ మోతాదులు ఏమిటో అనే ఆలోచన నుండి వైద్య శాస్త్రము అనే మొలక పుట్టింది. ఈ మోతాదును బయట తయారు చేయలేమని ఆరోగ్య దేవతికి  చక్కని ఆహార పదార్ధాలు సమకూర్చితే , ఆమె ఏ తనకు కావాల్సిన విధముగా మోతాదులు నిర్ణయించుకొని ఒండుకొని తింటుంది ,  ఆమెకు ఆ  శక్తీ వుంది  అన్నారు  . అట్లా మందులు పుట్టాయి .

పై లాంటి ఆలోచనలు- అనగా రోగము అంటే ఏమిటి? అది తప్పించుకోవటం ఎలాగా  అన్న ఆలోచనలు సామాన్యులకు కూడా వచ్చే ఆలోచనలే .   అందువల్ల  ఒకరికొకరు సంభందం లేకుండా అనేక దేశాల వారు అనేక వైద్య విధానాలు కనిపెట్టారు .

శరీరములో ఎదో వున్నది - అది మారితేనే రోగము అని, అన్ని వైద్య విధానాలు ఒప్పుకున్నాయి  .ఆ మార్పును సరి చేయటానికి  ఎవరి మందులు/  ఆహారము  వారు రూపొందించు కున్నారు .

గ్రీకులు Pathophysiology అనగా "భాధ పడేవారి భౌతిక శాస్త్రము" అన్న పేరున ఒక శాస్త్రము ను ఆరంభము

చేశారు.    ఈ శాస్త్రము  -- భౌతిక లక్షణాల ను బట్టి రోగమును  నిర్ధారించు శాస్త్రము అని ---. ఒక న్యాయ స్థానములో ఒక తీర్పును  సవాలు చేయటానికి ఎట్లా వీలు వున్నదో, అదేవిధముగా  ఈ శాస్త్రమును కూడా  సవాలు చేయవచ్చును  అని  పేర్కొంటూ రోమన్లు ఈ శాస్త్ర అధ్యయ నానికి శ్రీకారం చుట్టాబు

.ఈ శాస్త్రములో ని విషయాలలోని నిజానిజాలను ఎవరైనా ప్రశ్నించ  వచ్చు అంటూ రోమన్లు కల్పించిన వెసులు బాటు వలన - ఒక ప్రశ్న దానిమీద సమాధానము - సమాధానము మీద మరో ప్రశ్న అన్న పద్ధతిలో   వైద్య శాస్త్రము  ముందుకు కదిలింది . తమకు నచ్చని సమాధానము దొరకని వారు వేరే  వైద్య విధానాలకు శ్రీకారం చుట్టారు  . రోమనుల Pathophysiology  ఎక్కువమంది ప్రశ్నలకు సరి అయిన సమాధానము ఇస్తున్నందు వల్ల, ఇది చాలా మంది ఆదరణకు నోచుకోని - ప్రపంచము అంతటా విస్తరించింది .

సేకరణ - రచన వారణాసి శ్రీ రామకృష్ణ ఆఫ్ అమరావతి

2 ఆరోగ్య శాస్త్రము     మొదటి రోజులు -17-5-24

రోమనుల ఆరోగ్య దేవత పేరు సెల్స్. శరీరము సురక్షితంగానూ - నాశనం అయిపోకుండాను - సంక్షేమం తోనూ నూ ఉండేటట్లు చూసేది ఈమె భాద్యత . . ఈ మూడు మాటలు కూడా రాజ్యానికి సంభందించిన వి కూడా అవుతాయి . ప్రజల ఆరోగ్యమే రాజ్యానికి పునాది అని రోమన్లు భావించారు. అందు వల్ల రాజ్య సంక్షేమ దృష్టితో రోమన్లు వైద్య శాస్త్రాన్ని అభివృద్ధి చేశారు. అనగా సంపాదనల కోసము కాదు .

Salus , కాక రోమనులకు Hygeia అనే మరొక ఆరోగ్య దేవత 600s BCE నుండీ వున్నది .ఆరోగ్యానికి శుభ్రత ముఖ్యము అని గుర్తించినాక రోమనులు ఈ దేవతను కల్పించారు .ఈ దేవతను కల్పించగానే శుభ్రత ఆధారంగా రోగాలు తగ్గించుకునే /నివారించుకునే తెగ ఒకటి తయారు అయ్యి - స్నానాలు చేయటం శుభ్రంగా ఉండటం అన్నది ఆ తెగయొక్క ఆచారంగా మారింది . స్నానం చేసినాక నమస్కారం పెట్టు కోవటానికి వీలుగా ఈ దేవత బొమ్మని రోమన్ ఆలయాలలో కూడా నెలకొల్పారు . హైగైయా = Hygieia కారణముగా హైజీన్ అనే మాట పుట్టింది .

Hygieia కి నలుగురు చెల్లెళ్లు . వీరు అపోలో అనే దేముని ముఖము నుండి వెలువడిన వారు . అపోలో అనే అయన చిన్న పిల్లలు పెరిగి పెద్ద అయ్యేందుకు కావాల్సిన ఆరోగ్యానికి భాద్యత వహించుతాడు . చిన్న పిల్లలకు

శుభ్రమైన అలవాట్లు హైజీన్ నేర్పటం మొగవారికి సాధ్యం కాదని తోచి ఏమో ఈయన ముఖము నుండి  ఈ నలుగురు ఆడ దేవతలను సృష్టి చేశారు .వీరిలో  మొదటి ఆమె  ; Panacea  -- మనము ప్రపంచము లో ఏ మూలకు వెళ్ళినా గానీ ఆరోగ్యం గా ఉండటం ఎలాగో నేర్పే దేవత . రెండో ఆమె ; Aceso రోగము తగ్గ వలసిన  విధానాన్ని { అనగా రోగము వెనక్కు పోతూ ఏమి లక్షణాలను చూపాలి  } అనే విషయాలను తెలుపుతుంది .    మూడో ఆమె ; Iaso - ఈమె - రోగము వలన పోగొట్టు కొన్న శక్తిని తిరిగి ఇస్తుంది .మరలా రోగము బారిన పడకుండా ఆపుతుంది .  నాలుగో ఆమె Aegle -- ఈమె వంటికి ఆరోగ్యపు కాంతిని ఇస్తుంది . { మోహము కళా విహీనంగా వుండటము బట్టి మనము ఎదో జబ్బుతో ఉన్నామని ఎదుట వారు గ్రహిస్తారు కదా ?} ఏదైనా ఒక కొండ కొమ్ము మీదకు ఎక్కినపుడు - భోమి ఆకాశము కలిసిన చోటు అనగా ఎదో ఒక అంతము అనేది కనపడుతుంది . అంటే ఆపై  చూడటానికి ఆలోచించటానికి ఏమీ లేదు అనే వూహ వస్తుంది  . కానీ వైద్యశాస్త్రము  అనే కొండను ఎక్కి మానవ   శరీరము వైపు చూస్తే- ఏ అంతము కనిపించక పోవటంతో చాల మంది వైద్య శాస్త్రము అనే కొండను ఎక్కే పని నుండి  విరమించుకున్నారు . అందువల్ల చాలా  వైద్య విధానాలు మరుగున పడి పోయినాయి  . అంతే కాక నేర్చుకున్న దానితోనే ఎదో ఒక

వైద్యము ప్రతిపాదించిన వారు కూడా తయారు అయ్యారు .
అవి రెమిడీస్ లేదా చిట్కా వైద్యం కిందకు మారింది .
వైద్య శాస్త్రము అంటే అనేక ఆలోచనలతో కూడినది
మరియు అనేక సంగతులను పరిచయము చేసే శాస్త్రము
అని గమనించిన వారు దీని విస్తరణకు పూనుకున్నారు .
ఒక రాజు లేదా రాణి చెరిత్రలో భాగము అయినట్లు - వైద్య
శాస్త్ర రంగములో కృషి చేసిన వారు కూడా చెరిత్రలో ఒక
భాగము అవ్వగలుగుతారు అని గ్రహించిన వారు - ఈ
వైద్య శాస్త్రమునకు ఎంతో జోడించారు .
నేడు డబ్బు కోసమని అభివృద్ధి చేయబడుతూ వున్నా వైద్య
శాస్త్రము ఒకొప్పుడు కేవలము కీర్తి కోసము మాత్రమే
అభివృద్ధి చేయ బడింది . కీర్తి సంపాదించునే వారి పట్ల
విలన్లుగా--ఆపరేషన్స్ ను , ప్రయోగాలను { శవాలను కోసి
పరీక్షించటము } ఒకే రకపు రోగము గురించి వందల మంది
రోగులనుండి విషయాలు సేకరించటం -- అనే దానిని
వ్యతిరేకించే వారు అనేకులు పుట్టుకు వచ్చారు .
ఎన్ని వ్యతిరేకతలు వచ్చిన గానీ "మానవులతో పాటు గా
పుట్టిన మానవుల తెలివి అనేది మనిషి ని ఆరోగ్యముగా
ఉంచటం ము కోసమే ' అన్న అభిప్రాయం బాగా వ్యాప్తి
చెంది - వైద్య పరిశోధనలకు {శవాలను కోసి పరీక్షించటము
చేసేవారిపట్ల } ప్రోత్సాహం పెరిగింది .

తప్పు చేయటం మానవ సహజం - ఆ తప్పును కప్పి పుచ్చుకునే ప్రయత్నం మరింత సహజము . దీనికి వైద్య శాస్త్రకారులు   మరియూ వైద్యులు మినహాయింపు కారు . వైద్య విజ్ఞ్యానము తప్పు దారి పట్టిన పుడు దాన్ని తిరిగి దారిలో పెట్టటానికి అని - తప్పుడు అవగాహనతో వైద్య పరమైన నిర్ణయాలను తీసు కునే వైద్యులను  సరి దిద్ది దారిలో పెట్టటానికి అని.  వైద్య రంగములో స్పెషలైజేషన్స్ అనే శాఖ ప్రారంభము అయ్యింది .

సేకరణ సమర్పణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి

https://archive.org/details/20240518_20240518_0630

3 ఆరోగ్య శాస్త్రము -లో -  వైద్యుల గురించి   18-05-24

వైద్య శాస్త్రము - తనలో ముఖ్య భాగమైన వైద్యుల గురించి కొన్ని వివరణలు ఇచ్చింది . ఇది ప్రజలను జాగృతము చేయటం కోసము మరియూ వారిని చక్కని ఆరోగ్యము వైపు ద్రుష్టి మరల్చేటట్లు చేయటము    .
ఒక రోమన్ కథ ప్రకారము-  ఒక శిల్పి , చాల పని తనము వున్నవాడు , ఒక గుడి మీదకు ఎక్కి ఎదో శిల్పాన్ని సరి

చేస్తూ - కాలు జారీ కింద పడ్డాడు . అతడిని మరణానికి వదిలి వేశారు . ఈ శిల్పి సరి చేస్తున్నది Athena అనే దేవతశిల్పం. ఆమె శిల్పి మీద దయగొని ఆ శిల్పిలోని అవయవాలు{ముఖ్యముగా ఎముకలు } ఎక్కడ ఎక్కడ దెబ్బతిన్నవి వాటిని సరి చేయటం ఎల్లా అన్న జ్ఞ్యానాన్ని రోమను వైద్యులకు బోధించింది . అప్పటినుండీ మానవుల లోని ఎముకల నిర్మాణము పట్ల వైద్యులకు ఒక అవగాహన కలిగింది . ఎముకలు లేకపోతే మనిషికి చలనమే లేదు , అని అప్పుడే గ్రహించారు .. స్పెషలైజేషన్ అనేది ఒకటి ఏర్పరచాలని రోమనులకు అప్పుడే ఒక ఊహ కలిగింది . పై {చేతులు కాళ్ళు తల - వీటిలో వుండే ఎముకల వంటి వాటి గురించి విడివిడిగా పరిశీలించటం అనేది } ప్రవేశించింది .

స్పెషలైజేషన్ అనేది " తప్పులు" అనే వి ఒక దానికి ఒకటి ఎదురు పడేట్లు చేస్తుందని -ఏ ఒక్కరి అభిప్రాయాన్నిగూడ శిరోధార్యం గా భావించ వలసిన పరిస్థితులు ఏర్పడకుండా నివారిస్తుందని చెప్పారు .
పాత దారులను మూసుకుంటూ పోతేనే కొత్త దారులు ఏర్పడతాయని వైద్య శాస్త్రము అంటుంది . పాత దారులు మూయకుండా ఆలోచించే వారు , చివరికి ఎడారిలోకి చేరుకుంటారు అని { అనగా వైద్యులు నకిలీ వైద్యము

చేస్తారని ఆ కారణంగా ప్రజలు నకిలీ  పైద్యుల చేతిలో పడతారని } కూడా  పైద్య శాస్త్రము హెచ్చరించింది .

బాగా తెలివి కలవారు - వారు మంచి ఆరోగ్యములో వున్నపుడు - విలువలేని పైద్యాన్ని ప్రతి పాదిస్తారు అని . నూతన పైద్య విధానాలను విమర్శిస్తారు అని , అదే వారి ఆరోగ్యము చెడిపోయినపుడు మాత్రము  - నూతన పైద్య చికిత్సల కోసం పెతుకుతారని పైద్య శాస్త్రము అన్నది .

చిట్కా పైద్యులు - ప్రకృతి ని గమనించి - లేదా రోగాన్ని ఎదిరించటానికి దేహానికి వున్నా సహజ లక్షణాలను ఆధారము చేసుకుని పైద్యము చేస్తారు అని { కామెర్లకు నాటు మందు - ఎముకలకు కట్లు వంటివి }.   వీరికి క్రమ క్రమముగా పైద్యము అందించటంలోని  ఇబ్బందులు తెలుస్తాయి అని  . అప్పుడుఏ మందు అయితే తమకు ఎక్కువ ఆదాయము లేదా సంతృప్తి తెచ్చి పెట్టినదో దానిసే తమ స్పెషల్ పైద్యము కిందకు మార్చుకుంటారు . ఆ పై మామూలు పైద్యం విరమించుకుంటారు  అని కూడా పైద్య శాస్త్రము చెప్పింది .

మొదటి రోజుల్లో పైద్యము మీద కవిత్వములు కూడా వచ్చాయి. అవి అన్నీ కూడా నకిలీ పైద్యుని మీద చేసిన

హేళనలే . అనగా నకిలీ వైద్యులు అంతగా విస్తరించి వుండే వాఋ అన్నమాట . ఈ కవిత్వాల ప్రకారము --నకిలీ వైద్యుడు అర్ధరాత్రి వరకూ రోగి కోసమని వేచివుంటాడు . నిజమైన వైద్యుడు మరు క్షణం రాబోయే రోగి కోసం మాత్రమే వేచి చూస్తాడు .లేదంటే ఇంటికి వెళ్లి పోతాడు .నకిలీ వైద్యుడు  అర్ధరాత్రి పూట కూడా ఆలోచిస్తాడు .రేపు ఎవరు వచ్చి పంచాయతీ పెడతారా అని .నిజమైన వైద్యుడు కూడా అర్ధరాత్రి వరకూ ఆలోచిస్తాడు . అతడు రేపు రాబోయే పేషేంట్ గురించి కాక - రాబోయో తరాల గురించి ఆలోచిస్తాడు.

రచన సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి .

**4** తొలి తరపు వైద్యము దృష్టిలో **-** గర్భిణులు  21-0524

అందరికీ కూడా సూర్యని వల్లనే పిల్లలు పుడతారు -కానీ రాజులకు పిల్లలు కావాల్సి వచ్చినపుడు సూర్యుడే రాజుగా పుడతాడు.  ఇది మొదటి రూల్ .

ఒక కాయ రెండు కాయలు గా మారాలి  అంటే కాయలో విత్తనము ఉండాలి . అలాగే ఓ మనిషి రెండు మనుషులుగా

అవ్వాలి అంటే స్త్రీ గర్భము తో ఉండాలి .ఇది రెండో రూల్ . దేముడు అయినా సరే ఇంకో అవతారంలో కనపడాలను కున్నపుడు , ఆయనకు కూడా గర్భ వాసము తప్పని సరి . ఇది ఎందుకు చేప్పాను అంటే ? గర్భము లేని పుట్టుకను ఎవరూ ఊహించ లేకపోయినారు అని తెలియ చేయటానికి.

.

సృష్టి మొదటి రోజుల నుండీ తన లక్షణమును మార్చుకొనని అనగా పరిణామ క్రమమును లోను కానీ వాటిల్లో వాటిలో రక్తము { రక్తము గురించి వేరే ఒక వ్యాసము వున్నది } మరియూ గర్భ సంచీ ముఖ్యమైనవి . రోమనుల వైద్య శాస్త్రము గర్భవతులు సంగతి చెప్పేటప్పుడు - నవనాగరికులనుచూసి కాక మామూలు నాగరికులను లేదా అసలు నాగరికతే లేని వారిని దృష్టిలో పెట్టుకుని ఏ అన్ని విషయాలు విశ్లేషించింది .ఎందుకంటే జనులలో వీరే మెజారిటీ కాబట్టి. రాణులు గర్భం ధరించటం దాని మీద పరిశీలనా/ పరిశోధన కనపడవు . రాణులు ఎప్పుడూ కూడా ఎదో వరం వల్ల గర్భవుతులై - ఆ వరం వల్లనే చక్కని శిశువును కనటం --అనే కధలే ఇందుకు సాక్షం . ఒక అనాగరిక స్త్రీకి జరిగిన సుఖప్రసవం రాణీ కి కూడా రప్పించటమే అతి మొదట తరపు వైద్యము .

రోమనులు ప్రసవం గురించి ఇలాంటి అభిప్రాయాలు కలిగి ఉండేవారు .
కడుపులోని శిశువును బయటకు పంపి వేయాలి అని ఒక అవయవము {మంచి శక్తి } ప్రయత్నిస్తూ ఉంటే దాన్ని మరొక అవయవము { చెడు శక్తి } నిలువరిస్తూ వున్నదని - ఈ రెండింటికీ  మధ్య ఎన్నటికీ కుదరని సఖ్యత వున్నదని అదే ప్రసవపు ప్రక్రియ  అని చెప్పారు . ప్రసవపు నెప్పులను రూపు మాపలేమని - కానీ  దెగ్గర ఉండి- ప్రసవ కార్యక్రమాన్ని  సజావుగా నడిచే  టట్లు చేయవచ్చు నని కనుగొన్నారు.  ఈ ప్రక్రియ ను అంతా పర్యవేక్షించే  వారికి - ఎంతో  అప్రమత్తత ఉండటం అవసరము అని అన్నారు . అప్పుడు పురుళ్ళు పోసే స్త్రీలు ఏర్పడ్డారు .  శరీరము లోని మంచి శక్తీ --చెడు  శక్తీ పోరాడుకుంటూ ఉండగా బిడ్డ జన్మించితే  దైవపు శక్తి నెగ్గినట్లు ,  అని చెపుతూ దేముని యొక్క చేయూతను ప్రసవ రంగములోకి ప్రవేశ పెట్టారు . ఈ రకంగా వైద్యము కూడా ,  దైవము ను ఒక ఓదార్పు లేదా చేయూత గా మార్చింది  .  ప్రసవం అనేది  శరీరము లోనే ఉన్న మంచి శక్తీ + దైవము ఒక వర్గముగా ,  శరీరములోని చెడు శక్తీ +దుష్టశక్తి ఒక వర్గముగా మారి --చేసుకునే యుద్ధాలు అని వర్ణించారు .వీటి ఆధారంగా అనేక  కధలు వచ్చాయి .

ఒక స్త్రీ అనేక రోజుల ప్రసవ వేదన పడి మృత శిశువుని కంటే - దైవము దుష్టశక్తి పుట్టకుండా ఆపింది అని చెప్పారు . అదే స్త్రీ కనుక ఎన్నో రోజుల ప్రసవ వేదన పడి జీవించి ఉన్న పిల్లవాడిని కనుక కంటే, ఆమె దైవాన్ని వ్యతిరేకించే శక్తి ని కన్నది అని - చెప్పుకొచ్చారు .{ మనకు సంభందించి దుర్యోధనుని జన్మ ప్రక్రియ గుర్తు చేసుకోండి} ప్రసవ వేదన కు పట్టిన సమయాన్ని పట్టి పిల్లాడిని ఊహించారు . అటు దైవానికి ఇటు దయ్యానికీ కూడా గర్భవాసము లేని పుట్టుక ను ఎవరూ ఊహించలేక పోయినారు . అందువల్ల ప్రసవ నొప్పులు తెప్పిస్తున్న దుష్ట శక్తిని ఓడించే ఉద్దేశ్యముతో - ప్రసవపు సమయపు పూజలు, మంత్రాలు - గర్భిణులకు ఇచ్చే నొప్పి నివారణ మందులు పుట్టాయి .

ఈ సందర్భంలో ఒక కథను ప్రస్తావించుకొని ఉత్సాహం తెచ్చుకుందాము .
Ishtar అనే దేవత, బాబిలోన్ ప్రాంతానికి ఒక రాజును సృష్టించాలి అనుకున్నది . ఈ దేవత తన కోరికను Etana అనే అతనితో చెప్పింది . ఇతని భార్య గర్భము రావాలె అని కోరుకుంటూ వున్నది . పిల్లలకు { కడుపులో కి పంపి ప్రాణ ప్రతిష్ట చేసే} ప్రాణము పోసే మూలిక నింగిలో ఎక్కడనో వున్నది .ఎక్కడ ? అంటే- ఒక పెద్ద పాము తల మీద ఒక పెద్ద చెట్టు ఉంటుంది . ఆ చెట్టు చిటారు కొమ్మన

వున్న ఒక గ్రద్ద గూటిలో ఈ పిల్లలకి ప్రాణము పోసే మూలిక ఉంటుంది . సూర్య దేవుని ఆదేశము ప్రకారము ఈ గ్రద్ద మరియూ పామూ స్నేహంగా ఉండి ఒకరి కొకరు సహకరించుకుంటూ వుంటారు . పాము తనకు పిల్లలు కావాలనుకున్నప్పుడు గ్రద్దను అడిగితే అప్పుడు గ్రద్ద తన వద్ద వున్న పిల్లలకు ప్రాణము పోసే మూలికను పాముకు ఇస్తుంది . అంతే కాక తాను తెచ్చుకున్న ఆహారాన్ని పాము పిల్లలకి కూడా తినిపిస్తుంది . అలాగా వీరి స్నేహము వైరానికి అతీతము అయినది . కానీ ఒకనాడు గ్రద్ద పాముపిల్లలని తినేస్తుంది. అప్పుడు సూర్య దేవుడు పాముచేత గ్రద్దకు శాపం ఇప్పిస్తాడు . ఆ శాపం మూలకంగా గ్రద్ద ఒక చోట ఇరుక్కు పోయి ఆకలితో అలమటిస్తూ ఉంటుంది . Etana ఈ ఆకలి కొన్న గ్రద్ద కు ఆహారము ఇచ్చి దాని ప్రాణాలు కాపాడాడు తాడు .ప్రత్యుపకారం కోసమని గ్రద్ద పిల్లలకు ప్రాణము పోసే మూలికను Etana కి ఇచ్చి వేస్తుంది .

ఇలాగా Etana యొక్క భార్య గర్భిణీ అవుతుంది. అప్పుడు Etana తన భార్య మరీ ఎక్కువ పురిటి నొప్పులు పడకుండానూ - మరీ తక్కువ నొప్పులు పడకుండా ఉండేటట్లు ఒక పూజ చేయించు తాడు . దీనికి కారణం - ఎటువంటి పురిటి నొప్పులు లేకుండా పిల్లవాడు పుడితే వాడికి దేవుని అనుగ్రహం ఉన్నట్లు . కానీ దేముడికి

వ్యతిరేకంగా ఎక్కడో ఒకక్కడ ఎవడో ఒక దుష్ట శక్తి పుట్టే ఉంటాడు - వాడు తన పిల్ల వాడికి బాల్య గండాలు కల్పిస్తాడు అని Etana భయము . అలాగే పురిటి నొప్పులు గట్టిగానూ సుదీర్ఘము గానూ వచ్చి బాబు పుడితే - దుష్ట సెక్తి పుట్టినట్లు .
అప్పుడు కూడా దుష్ట సెక్తిని అంతమొందించటానికి అని దేముడు ఎక్కడనో ఒకచోట పుట్టి ఉంటాడు . ఆయన కూడా తన పిల్ల వాడికి బాల్య గండాలు కల్పిస్తాడు అని Etana భయము. అందువల్ల పురిటి నొప్పుల యుద్ధము అనేది లేకుండా చూడాలని Etana కోరిక . ఈ కధ ఇంకా ఎంతో వివరంతో ఉంది కానీ మనకు ఇక్కడి వరకే అవసరం అనుకుంటాను .పురిటి నొప్పులు లేకుండా చేస్తే మంచిది నే ఈ కధలోని ఉద్దేశ్యము .
పై కథ పురిటి నొప్పుల గురించి - దాని పై అతి ప్రాధమిక అభిప్రాయాలను తెలుపుతూ / బలపరుస్తూ వున్నది .
" ఈ విషయము గ్రహించ వలసినది అన్న ఉద్దస్యముతో పురాణ కథను సృష్టించి చెపుతారు .జనులు ఆ వుద్దేశ్యము గ్రహించకుండా, ప్రతి పురాణ కథను నిజాము అని మాత్రమే నమ్ముతారు .

సేకరణ రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

.



**ABOVE IS The Myth of Etana. Seal impression of the Akkadian Empire period**.

**5** తొలి నాటి ఆరోగ్య శాస్త్రము - రక్తము- రోగము 21-05-24

-ఈరోజున మన శరీరములో ఎటువంటి రక్తము వున్నదో -సృష్టి మొదటి మానవుడిలోఅనగా లక్షల ఏండ్ల నాటి మానవుడిలో కూడా అదేరక్తము వున్నది . -ఇలా ఎందుకు అనవలసి వచ్చిందంటే ? మానవులు మొదట లో కోతులు లాగా నడిచి, చివరికి నిటారుగా నిలబడి నడిచారు . ఇది పరిణామ క్రమము, ఈ పరిణామ క్రమము లో , రక్తానికి ఏమీ మార్పులు రా లేదు. యుగ యుగాలుగా రక్తము ఒకే తీరుగా వుంది - ఇంకా అలాగే ఉండబోతున్నది . ఇలా ఉండక

పోతే - అప్పుడెప్పుడో కనిపెట్టిన వైద్యపు పద్ధతులు నేడు మనము ఉపయోగ పడవు . మనము ఈ తరములో కనిపెట్టిన వైద్యము రెండు  తరాల తరవాత నిష్ప్రయోజనం అవుతుంది .రక్తములో పరిణామ క్రమము అనేది కనుక ఉంటే వైద్యము అభివృద్ధి చెందేదే కాదు . మనకు అధునాతన చికిత్సలు దొరికేవి కాదు .   . వేల సంవత్సరాల క్రితం నుండీ అభివృద్ధి పరుచుకుంటూ వస్తున్న వైద్యము నేటికీ పనికి వస్తుంది - ఇక ముందు తరాలకు కూడా పనికి వస్తుంది. ఇదంతా రక్తము యొక్క ప్రయోజకత్వమే .

"మొదటి యుగపు  మనిషిలో వున్న రక్ధము ఇప్పుడు మనిషిలో  వున్న రక్ధము ఒక్కటే" - అనేది కాదనలేని విషయము కాబట్టి -  రోగము అనేది మానవ జాతి పుట్టిన రోజు నే   పుట్టింది అనివైద్య శాస్త్రము నమ్ముతుంది .  రోగాలు అనేవి,  ఆది మానవుల రక్తము లో కొన్ని మార్పులు వచ్చిన తదుపరి వచ్చినవి కావు .{అనగా మొట్ట మొదటి మానవ రక్తము లోనికి కూడా రోగాలు ప్రవేశించినవి అని వివరణ   } మనిషి యొక్క మెదడు పెరిగి న తదుపరి , తన శరీరములోని ఏదో ఒక ఒక విషయము తనను కలత పెట్టటాన్ని అనుభూతి చెంది ఉంటాడు .ఈ అనుభూతియే రోగము .మనుషులకు అనుభూతులు అనేవి కలిగిన నాటి నుండీ రోగాలు అనేవి బయటికి వెల్లడి అయినాయి .   ఇవాళ్టి

కి కూడా రోగము వస్తే , ప్రపంచము లోని ఏ మనిషి అయినా సరే ముందుగా కలత పడతాడు . అందువల్ల -- రోగము అనగా మనిషిని కలత పెట్టే విషయము అని నిర్వచనం ఇచ్చారు { ఇదే క్రమముగా నలత అయిందేమో? } రక్తము ఎక్కడ ఉంటే అక్కడికి కలత ప్రేవేశించ గలుగుతుంది . పురాతన మానవుడిలో కూడా ఇవాళ మనకు ఉన్నటువంటి రక్తమే వున్నది . ఇప్పుడు మన వంటిలోకి రోగము ప్రవేశించినట్లే - ఆ నాటి పురాతన మానవుల వంటిలోకి కూడా రోగముప్రవేశించేవి . చివరికి ఏమనంటే ?రక్తము మరియూ రోగములు సృష్టి మొదట నుండీ వున్నవి అని .

అప్పుడురోగములు అనేవే లేవు - వారు తినే కందమూలాలు వారికి రోగాన్ని రానించేవి కావు అని ఎవరన్నా సరే వాదించే వీలు కూడా వున్నది . మరి దెబ్బలు తగలటం కాళ్లు విరగటం అనేవి అప్పుడు లేవని అనగలమా ?

ఖడ్గ మృగము తన కొమ్ముతో ఏదైనా మృగాన్ని కుమ్మినపుడు - అవతలి జంతువు రక్తము ఓడుతూ మరణించటం పురాతన మానవులు గమనించారు . రక్తము పోవటం అంటే ప్రాణము పోవటమే అని గ్రహించారు . అందువల్ల పురాతన మానవులు దెబ్బలు తగిలించుకొని దాని నుండి రక్తము కారి పోవటానికి అంగీకరించలేదు .

రక్తమే ప్రాణము అనుకున్న రోజులలో - ఏదన్న యుద్ధము కనుక జరిగితే - ఎదుట మనిషిలోనుండి రక్తమును కార్పించి నట్లైతే అతనిని చంపినట్లే అన్న నమ్మకం ఉండేది . కానీ రక్తము నకు - గడ్డ కట్టుకోవటం అని సహజ స్వభావము, వున్నదని గుర్తించినాక తలలు నరకటం ప్రారంభము అయింది .

రక్తము కార్చుతున్న జంతువులు చెట్ల ఆకులను పూసుకుంటూ తిరగటం , లేదా చెట్ల బోదెలకు శరీరము రుద్దు కొంటూ వుండటము లేదా దుమ్ము/ బురదలో దొర్లుతూ వుండటము చూసి - రక్తము కారిపోకుండా చూసుకునే పద్ధతులు ఉన్నవని - అనగా రక్త స్రావం కారంముగా ప్రాణాలు పోకుండా ఆపుకునే పద్ధతులు ఊహించారు . రక్తము కారుదలను ఆపే ఫద్ధతులను వేరు వేరు తెగల వారు వేరు వేరుగా కనిపెట్టి - తమలో తాము ఇచ్చి పుచ్చుకున్నారు . రక్తము కారటాన్ని ఆపిన వారే మొదటి తరము ఘన వైద్యులు .

శరీరంలోకి దిగి రక్తము కార్పించిన వస్తువును బయటికి లాగితే ఆ గాయము నుండి రక్తము మరింత కారు తుంది కదా ? అందువల్ల రక్తము కార్పించిన వస్తువును గాయము నుండి బయటికి తీసే వారు కాదు .వారిని సహజ మరణానికి వదిలి వేసేవారు .

సేకరణ సమర్పణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

**6** ఆరోగ్య శాస్త్రము **-** మొదటి తరపు-సర్జరీ 26-05-24

ఒక నీటి ఏనుగు తన యొక్క శరీర { చెట్టు బోదెకు శరీరాన్ని రుద్ది } గాయాన్ని మరింత పెద్దది చేసుకొని చాలా ఎక్కువ రక్తము స్రవించి, ఆ తరువాత వెళ్లి సముద్ర జలాలలో దిగటాన్ని రోమన్లు చూసారు .చూసి నీటి ఏనుగు అనేది అత్యంత తెలివిగల జంతువుగా వర్ణిస్తూ కొన్ని కథలు కవిత్వాలు రాసారు . దీనిని బట్టి గాయాన్ని కెలికి వదిలితే-దానిలోనుండి రక్తము దానితో పాటుగా లోపల ఇరుక్కున్న బాణపు ముక్క { సాధారణముగా ఎముక ముక్కనే బాణపు ముక్కు } బయటికి వస్తుందని - ఉప్పునీరు గాయాన్ని త్వరగా మానిస్తుందని మొదటి తరపు వైద్యులు కని పెట్టారు . గాయాన్ని కెలికి మరింత రక్తము కార్పించటం - అరక్తము తో పాటు లోపల ఇరుక్కున్న వస్తువును బయటికి తెప్పించటం అనే ఆలోచన ఆధారంగా ప్రాధమిక దశ సర్జరీ పుట్టింది . భయం లేకుండా ఏదో ఒక పుండుని / శరీరము లోని వాపును / లేదా గడ్డ కట్టిన రక్తాన్ని కెలికిన వారు ఎవరో ?వారే మొదటి తరపు సర్జన్లు .అప్పటిలో గాయాన్ని మూయటానికి బంక మట్టి వాడేవారు .

శరీరము ను వీడి బయటకు వచ్చే రక్తము ఏవిధమైన నొప్పిని కలుగ చేయనపుడు అది ఒక జబ్బుకు సంకేతము కాదు అని . సెత్తురు గడ్డ / వుండు పగిలినా కూడా ఒక రిలీఫ్ ఉంటుంది అని గ్రహించారు . దీని ఆధారంగా పుండు పడిన శరీర భాగాన్ని కెలకటము అనగా సర్జెరీ అనే ఆలోచన వచ్చింది .అప్పటి సర్జరీ పరికరాలు చేప ముళ్ళు , షార్క్ చేప యొక్క దంతాలు { శరీరము పై కోత పెట్టటానికి }

పుండ్లు లేదా గాయాల కోసము అని పుట్టి న సర్జరీ, ఆ వెంటనే, మనిషి మాడు పైకి మళ్లింది .

కోపము, బీపీ, తల, తిరగటం మూర్ఛలు రావటం అప్పుడు కూడా ఉండేది . ఎదో ఒక రకపు విషపు గాలి నోటిలో నుండి తలలోకి దూరటం వల్లనే, కోపాలు మూర్ఛలు వంటివి వస్తున్నాయని తొలి తరపు వైద్యులు అనుకున్నారు . తల లో కి వెళ్లిన గాలిని బయటకు పంపించి వేస్తే తలకు సంభందించిన రోగ లక్షణాలు తగ్గుతవి అనుకున్నారు . అందు వల్ల మాడు పైన రంధ్రము చేయటం మొదలు పెట్టారు.
ఇంగిలీషు లో crevice అనే మాటవున్నది . డిక్షనరీ ప్రకారము crevice - ఆనగా రెండు శరీర భాగాలు ఒకటి గా కలుసుకుటప్పుడు ఏర్పడే , లోతైన ముడుత . కపాలం పైన

వున్న ఇలాంటి ముడుతలను gyrus అంటారు, gyrus అనగా కపాలపు ఎముకపై వున్న ఎత్తు పల్లాలు. ఈ ఎత్తు పల్లాల ఆధారం గా పల్లముగా వున్నచోటున రంధ్రము చేసేవారు . ఇది చేయటానికి అంత సులువైన పని కాకపోయినా కానీ చేశారు . ఈ రంధ్రముల తరువాతమనిషి నూటికి నూరు శాతము మరణించే వాడు . పురాతన గుహలలో దొరికిన మానవ పుర్రెలలో గుండ్రని రంధ్రము చేయబడి ఉండటాన్ని గమనించిన నేటి శాస్త్రవేత్తలు - ఈ రంధ్రాలు ఎదో ఒక వైద్యములో భాగముగా చేసినవే అని అభిప్రాయ పడ్డారు . వారే ఇది మొదటి తరము సర్జరీగా గుర్తించారు .
రంధ్రాలు చేయించుకోవటానికి ఆదిమ జాతి మనుషులు ఇష్టపడక పోవటం వల్ల - " మెదడు లో చేరిన గాలి " అనేది కాస్తా దుష్ట శక్తి లేదా గాలి దయ్యము కిందకు మారింది . ఇలా మార్చిన వారు క్షుద్ర / మంత్ర తంత్ర వైద్యులు . ఈ వైద్యులు -- కుళ్ళి పోయిన చాపల కంపు మనిషిచే పీల్పించినట్లైతే దుష్టశక్తి ఆ వాసన భరించలేక తలలోనుండి బయటకి వెళ్లి పోతుందని ప్రతి పాదించి దాన్ని అమలు జరిపారు .
{ మన దేశములో కూడా - గాలి సోకింది /దయ్యం పట్టింది అనే దానికి మంత్ర తంత్ర వైద్యము జరిపేటప్పుడు -

ఎండుమిర్చి . వేపాకు కలిపి మండించిన పొగ ను మనిషికి వేసి దాన్ని వారు పీల్చేట్లు చేస్తారు . }

కాపాలానికి రంధ్రాలు వేయటం అనే సర్జరీ విఫలం చెందినాక - సర్జరీ అనే విభాగము అభివృద్ధి చెందటం మందగించింది . లక్ష తరముల కింద వున్న మన మన తాత కి ఆ నాడు సర్జరీ పట్ల కలిగిన భయమే మన జీన్సులోకి ప్రవేశించి - నేటికీ కూడా మనము సర్జరీ అంటే దడుచుకునేట్లు చేస్తున్నది అని ఒక సిద్ధాంతము వున్నది .ఆ సిద్ధాంతాలని నమ్మటం/ నమ్మక పోవటం అనేది మీ ఇష్టానికి వదిలి వేశారు .



పిచ్చెక్కిన మనిషి తలపై రంధ్రము చేయటము అనే ప్రక్రియను చూపుతున్న పెయింటింగ్ **1488 -1516** మధ్య కాలము నాటిది .ఈ ప్రక్రియను **english** లో **Trepanning** అంటారు .

సేకరణ సమర్పణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ ఆఫ్ అమరావతి

7. వైద్య రంగము తొలి నాటి మందుల ప్రవేశం

పిల్లలకు , పోలియో చుక్కలు వంటివి వేయటానికి మన ప్రభుత్వాలు ఎన్ని వ్యయ ప్రయాసలకు లోను అయ్యాయో మనకు తెలుసు . దేశ సంక్షేమ దృష్టితో ప్రభుత్వాలు ఇలాంటి మందును ఇచ్చే పథకాల్ని ప్రవేశ పెడతాయి . కానీ ప్రజలు వాటి పట్ల తక్షణమే మొగ్గు చూపరు . రాజుల ప్రోత్సాహంతో , రాజ్య సంక్షేమ దృష్టితో పూర్వపు తరపు వైద్యులు రోగాలకు మందులు తయారు చేస్తూ వుండే వారు . ఒక మందు తయారు కాగానే దానిని వాడటానికి ప్రజలు మొగ్గు చూపక పోవటానికి లేదా నో అనటానికి -ఇప్పటి కన్నా అప్పుడు వేల రెట్ల అవకాశము ఉండేది . ఈ నేపథ్యములో మందులు మనిషి జీవితం లోకి ఎలా ప్రవేశించాయి ?అనేది తెలుసు కుందాము .
చెట్ల ఆకులు , బెరడులు . వేర్లు , కాయలలోని విత్తనాలు - జంతువుల నుండి తొలగించిన కొన్ని ప్రత్యేక అవయవాలు వంటి వాటిని ఉడికించి వాటి సారాన్ని ముందుగా ప్రతిపాదించే దశకు వైద్య విద్య చేరుకున్నది . కానీ ఆ నాటి మనుషుల చేత మందులు తాగించడం అంత తేలిక విషయం కాలేదు . అప్పటి ప్రజలు-- రోగ నివారణకు మంత్రము అనే విధానానికి అలవాటు పడిఉన్నారు. ఇప్పుడు మనము మనకు అలవాటు ఐన వైద్య విధానము/

మందు/ హాస్పిటల్  నుండి ఇంకో వైద్య విధానానికి మళ్ల టానికి ఎలా తట పటాయిస్తామో - అదే  రకంగా పురాతన ప్రజలు కూడా   మంత్ర వైద్యం నుండి మందుల వైద్యము వైపు రావటానికి ట్ల తట పాటా యించారు .
అనేక సందర్భాలలో   మంత్ర వైద్యము  విఫలం అవటం వల్ల - మంత్రము కానిదీ - రోగము తో పోట్లాడటానికి అని నేరుగా వంట్లోకి  పోగలిగిన దానికోసము అతి   కొద్దిమంది ప్రజలు మాత్రమే  ఎదురు చూసారు . మంత్ర తంత్ర వైద్యము అంటే పిల్లలకూ పెద్దలకూ కూడా ఒకే రకం ఉంటుంది కదా ?  . మంత్ర వేత్తలు పెట్టే యాతనలు  - తమ పిల్లలు కూడా పడవలిసి వచ్చినపుడు - రోగం నిమిత్తము , మంత్రానికి బదులు ఇంకా ఏదన్నా  ఉండాలన్న  ఆలోచన కలిగిన వారే మందులను అంగీకరించారు .
ఏది ఏమి అయినా గానీ -  "చని పోయిన వారి  ఆత్మ - చెడు గా మారి  బ్రతికి ఉన్న వారి లోకి ప్రవేశిస్తుంది . అది ఏ రోగము అంటేనూ " -- అనే  అత్యధికుల నమ్మకాన్ని ఎవరూ తుడిచి వేయలేక పోయారు . . వీరు వైద్య రంగ పురోగతికి అడ్డంకి గా  ఉండేవారు .
ఆ ప్పుడు తత్వవేత్తలు { = సమాజం బాగు కోసం ఎదో ఆలోచనలు చేసే వారు }కలుగ చేసుకొని "  ఎదో చెడు ఆత్మ మనలోకి ప్రవేశిస్తే మన ఆత్మా,  ఆ చెడు ఆత్మా పోట్లాడుకోవాలి కానీ అవి  ఎందుకు రోగాలు తెప్పిస్తాయి ?

వాటికేమిటి ప్రయోజనము ? . ఒక మంత్ర వైద్య గాడు చీపురు కట్ట పెట్టి నెత్తి మీద బాదితే రోగము పోతుందా ? అనే ఆలోచనలను ప్రజలలోకి ప్రవేశ పెట్టారు " లెక్కకు మించిన ఆత్మలు ఉంటాయి .అందులోవి కొన్ని మాత్రమే చెడు ఆత్మలుగా మారాయి అనుకుంటే - మనిషిలోకి దూరటానికి అని ఎప్పుడూ కూడా నాలుగు కన్నా ఎక్కువ ఆత్మలు ఎదురు చూస్తూ ఉంటాయి . యుద్ధాలు జరిగినపుడు ఈ ఆత్మల సంఖ్య ఇంకా పెరుగుతుంది ? అందువల్ల దుష్ట ఆత్మలు- అవి తెప్పించే మిమ్మల్ని వదిలి వెళ్ళటం , మీరు స్వస్థత పడటం అనేవి ఎప్పటికీ సాధ్యము కాదు . వచ్చినది రోగము ను పట్టి దానికి మందులే వాడాలి " అని ఉద్భోదించారు .
ఇంతే కాక -- "దుష్ట శక్తి " వున్నది అనే ఆలోచనను ప్రజలలో నుండి పోగొట్టటానికి అని - " చని పోయిన వారి ఆత్మలు నివసించటానికి స్వర్గము అనే ప్రదేశము అనేది వున్నది - కాబట్టి - మనము పూజలు చేసి మన పూర్వీకుల ఆత్మలను అక్కడికి పంపి -- వారి ఆత్మలు చెడుగా మారి - ఈ భూమిపై తిరగనవసరం లేకుండా చేసి . పైకి సాగనంపుదాము అని ప్రతి పాదించారు .{ ఉదాహరణకు - హిందువులు పెట్టే తద్దినాలలో - చని పోయిన వారి ఆత్మలను స్వర్గానికి పంపుట అనేదే ముఖ్య విషయము - తద్దినాలు అనేవి రోగాల బారిన పడకుండా

తప్పించుకోవటానికి అని భారతీయులు అవలంభించిన ఒక విధానము అయి ఉండవచ్చునని నా వ్యక్తి గత అభిప్రాయము }

ఇలా ఎన్నో సంగతుల తరువాత. మానవులు మందును స్వీకరించటానికి సుముఖులు అయినారు .ఇప్పుడు మనము పెయిన్ కిల్లర్స్ ని కోరుకున్నట్లు , ఆనాటి మందులలో వంటికి మత్తు నిచ్చే లక్షణాలు వున్న మందులను పదే పదే కావాలి అని కోరే వారు కూడా ఏర్పడ్డారు . అప్పుడు ఆరోగ్య దేవతను సృష్టి చేసి - ఆమె ఆజ్ఞ గా మందుల కు మోతాదులు నిర్ణయించటం మొదలు పెట్టారు . ఆరోగ్య దేవతయే ఈ మందుల మోతాదు నిర్ణయించింది కాబట్టి - ఆమె చెప్పినట్టు వింటేనే రోగము నిమ్మదిస్తుంది ' అన్నారు . అలాగా మందుల వాడకంలో డోసేజి అనేది కూడా పుట్టింది .

ఇట్లగా వైద్య శాస్త్రము మానవులకు వున్నా అనేక మూఢనమ్మకాలను తిరస్కరిస్తూ -- మానవులకు మేలు చేస్తాయనున్న కొన్ని నమ్మకాలను- దేవతల పేరున ప్రవేశ పెడుతూ వచ్చింది . ఇటువంటి ప్రచారాల ఊతముతో మందులు రంగ ప్రవేశం చేసాయి .ప్రచారాల ఊతముతో టీకాలు పోలియో డ్రాప్స్ రంగ ప్రవేశం చేసి జనుల ఆమోదానికి నోచుకున్నట్లు అని పోలిక చెప్పుకుంటే సరి పోతుంది .

సేకరణ విషయ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

అదనపు విషయము --

భారతీయులకు సంభందించి ఆధర్వణ వేదమే మానవ శరీరము మరియూ రోగానాలను గురించి తొలి ప్రస్తాపనలు చేసింది. ఈ వేదములో జాండిస్ అనగా కామెర్లు అనే వ్యాధిని చూసి -- అది ఒక దుష్ట శక్తి గా భావించారు . అప్పుడు ఈ దుష్టశక్తి నుద్దేశించి , తమను విడిచి వెళ్ళమని- వెళ్లి ఒక పసుపు రంగు పక్షిలో ప్రేవశించ మని కోరే ప్రార్ధన లు కూడా చేశారు {జాండిస్ వ్యాధిలో కనులు పసుపు రంగుకు మారటం వల్ల - ఆ జబ్బు ఒక దుష్ట శక్తి అని ఆలోచించారు . అలోచించి - దానిని వెళ్లి పసుపు రంగు వున్న పక్షిలో కి పోయి నివాసం ఏర్పరుచుకోమని ప్రార్ధనలు చేశారు } అలాగే చలి జ్వరాలు వస్తే - అదికూడా ఒక దుష్ట శక్తి పని ఏ అని అలోచించి -ఓ దుష్టశక్తీ నీవు మమ్మల్ని వీడి పోయి చల్లని కప్పలోకి దూరు అని కూడా ప్రార్ధన చేశారు } . ఈరకంగా ఎదో ఒక దుష్ట శక్తి ఏ రోగానికి కారణనము అని - అవి ఉండటానికి తగిన చోటు చూపించి నట్లైతే రోగాలు మనలను విడిచి పోతాయి అని భారతీయులు కూడా నమ్మారు . ఆత్మలను స్వర్గానికి పంపి అవి మనకు చెడు చేయకుండా తప్పించుకోవాలన్న ఆలోచనను భారతీయులు తద్దినాలు అనే దాని ద్వారా

కనపరి చారు అని నా సొంత  దుష్ట సుక్తులే రోగాలు తెప్పిస్తవి అనే నమ్మకము ఇప్పటికీ చెక్కు చెదర కుండా వున్నదని చెప్పటానికి పెద్ద పెద్ద పట్టణాలలో  వున్నా మంత్ర వైద్యులే సాక్షం .

విషయం సేకరణ -  వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

8.మొదటి వైద్యుడు /వైద్యురాలు  .1-06-24

వైద్య శాస్త్రము గుర్తించిన   -ఈజిప్టు యొక్క   మొదటి వైద్యుడు /వైద్యురాలు గురించి .

ఈజిప్టు దేశములో పిరమిడ్ లు అనే మహారాజుల సమాధులే కాక, "మాస్టబ్స్ " అనే  మట్టి దిబ్బల వంటి సామాన్యుల సమాధుల గూడ అనేకం వున్నాయి . ఈ మాస్టబ్స్  సమాధులలో ఒక ప్రత్యేకమైన -  సమాధి వుంది . అది Sekhet అనే ఒక వైద్యునిది,  అని,  ఆయన రాజుగారి ముక్కు దిబ్బడను నయం చేసిన ఘన వైద్యుడు అని . ఆ సమాధి ముఖ ద్వారం మీద రాసి వుంది . ఇట్లాగా సుఖేత్ అనే అయన రికార్డు కు అందిన  మొదటి వైద్యుడిని  పేరు .అతని కాలము - (B . C. 3533 }

తన ముక్కు దిబ్బడను నయం చేసినందుకు కానుకగా ఏదన్నా కోరుకోమని - ఈజిప్ట్ చక్రవర్తి ఆజ్ఞ ఇచ్చినపుడు - ఈ వైద్యుడు " నా వివరాలు నా వృత్తి వివరాలు ఒక రాతి పలక మీద చెక్కించి నా సమాధికి ద్వారంగా ఉంచాలని కోరాడు" . అలాగా ఈయన మనకు తెలిసాడు.

. Hippocrates నేటి తరం వైద్యానికి పితామహుడు . ఈజిప్టు వారు వైద్య రంగములో వున్న వారినందరినీ "స్ను" అనే తెగ కిందకు చేర్చారు . వీరి ఇళ్లపై - "ఇది డాక్టర్ గారి ఇల్లు అని చెప్పటానికి గానూ " -- ఒక సూది లాంటి వస్తువు -- రెండు కప్పుగిన్నెలు వున్న బొమ్మ కల చిహ్నాన్ని పెట్టే వారు . ఇందులో ని సూది - అవసరమైనపుడు నరానికి బొక్క పొడిచి చెడు రక్తము కార్పించటానికి వాడేది . మీరు అనుకున్నట్లు ఆ రెండు కప్పులూ కారిన చెడు రక్తం సేకరించటం కోసం వాడేవి మాత్రం కాదు . ఈ కప్పుగిన్నెలను మనిషి శరీరము పై బోర్లించి - దానిలోనుండి గాలిని పీల్చి వేసి - వాక్యూమ్ క్రియేట్ చేసి - ఆ వత్తిడితో ఓ వైద్యము చేసే వారు . ఇది తలనొప్పులకు - వంటి నొప్పులకు , కండరాల నొప్పికీ ఆనాటి వైద్యము . ఈ కప్పులు దానికి గుర్తు .వంటి మీద వ్యాక్యూమ్ క్రియేట్ చేసి వైద్యం చేసే విధానము ఎంతో పురాతన మైనా కూడా ఇప్పటికి అమలులో వుంది .

అనారోగ్యము-- దుష్ట శక్తులు మరియూ దేమునితో ముడిపెట్ట బడినది కాబట్టి ఈజిప్ట్  దేవాలయపు పూజారులే వైద్యులుగా మారారు అని గతములో చెప్పుకున్నాము . ఈజిప్టు వారి దృష్టిలో జడ్జీ , లాయర్ వంటి వారు - న్యాయ దేవతకి పూజారులు . రాజు గారు స్వయంగా సూర్యుని జన్మ - కాబట్టి అయన సేవకులు -  సూర్య  దేమునికి పూజారులు . అందువల్లచాలా మంది తమను తాము పూజారి అని వర్ణించుకొని   , ఆపై - అదనపు సంపాదన కోసము  వైద్యము చేసే వృత్తి   లోకి దిగారు . ఇదికాక ఈజిప్షియన్ మిలిటరీ వారికి సింహము దేముడు.కాబట్టి సైన్యము అనగా సింహపు దేముని పూజారులు . యుద్ధభూముల్లో ని  అవసరత కొద్దీవీరికి వీరే వైద్యము చేసుకుసేవారు . ఆ అలవాటున వీరిలో కొందబు  డాక్టర్ వృత్తి చేపట్టారు   . వీరి వైద్య   విధానాలు వేరు అయినా ప్రజలకు వైద్యము చేయ వచ్చు  కదా ?

ఇప్పుడు గుడి పూజారుల నుండీ - రాజు గారి సేవకుల నుండీ - మిలటరీ వారి నుండీ - న్యాయశాస్త్రము నుండీ కూడా డాక్టర్లు పుట్టారు . రాజు గారి  ఉద్యోగియే డాక్ట బు అవతారం ఎత్తితే ,  అందరూ అయన దెగ్గరకు పోక తప్పదు కదా ? అందువల్ల కొంత కాలము పాటు వీరే జనము పాలిటి ప్రముఖ వైద్యులు అయినారు .

అసలు డాక్టర్ అన్న పదానికి అర్ధం - ఇంతకు ముందు వున్న గౌరవ నీయమైన అభిప్రాయాలను ప్రశ్నించే వాడు అని .
ఈజిప్ట్ మిలటరీ వారు కూడా వైద్యులే అయ్యారు కాబట్టి , వారి దేముడు అయిన సింహము వైద్య శాస్త్రానికి అధి దేమునిగా అయ్యింది . ఒకప్పుడు ఇలాంటి మిలిటరీ వైద్యుడు ఒకడు రాజు కి విషము ఇచ్చే ప్రయత్నం చేసాడు . అప్పుడు ,రాజుగారు - ఒక్కొక రకం డాక్టర్ కి ఒక్కోరకము వైద్యము కేటాయించారు . ఈనాడు మనము చూస్తున్న వైద్యము - కేవలం వైద్య విద్య చదివిన వారికి మాత్రమే దక్కింది . దానితో .నిజమైన వైద్యులకు ఆదరణ దొరికింది . ఆ తరువాత ఈజిప్టు వారికి గ్రీకు వైద్యులతో పరిచయం ఏర్పడింది . ఇప్పటికి వైద్యము మిలటరీ వారి చేతుల్లో నుండి బయట పడి పోయింది కాబట్టి , ఈజిప్టు వైద్యులు వైద్యానికి చెందిన అధి దేముని గా , సింహాన్ని కాదని "థత్ = Thoth " అనే దేముడుని పెట్టు కున్నారు . ఈ మార్పు వైద్యులు స్వతంత్రంగా వ్యవహరించే స్థాయికి చేరారు అన్న దానికి సూచన .

"థత్ = Thoth " అంటే చంద్రుడు . ఈయన లెక్కలు కట్టటానికి - ఏదైనా నేర్చుకోవటానికి - రాయటానికి అధి దేముడు . తమకు రాయటం నేర్పింది , భాషలను సృష్టి

చేసిందీ, ఒక భాషలోనుండి ఇంకో భాషలో కి అనువాదం చేసి చెప్పటం నేర్పింది ,  కూడా చంద్రుడే అని ఈజిప్టు వారి నమ్మకము.అందువలన ఈయన వైద్యానికి దేముడు అయినాడు . మన వారి దృష్టిలో మనో  భావాలను సృష్టించేది చంద్రుడు .

చంద్రుడు సూర్య దేమునికి నమ్మిన బంటు వంటి స్నేహితుడు అని, ఈ  భూమి మీద జరిగిన సంగతులు సూర్యునికి   వినిపిస్తూ ఉంటాడని ఈజిప్టు వారి భావన . { నా అభిప్రాయము - మనకు సూర్య వంశపు , చంద్ర వంశపు,  రాజులు అని ఇరు వంశాల రాజులూ వున్నారు . సూర్యుడి అంతటి గొప్ప వాడిని కాదని - చెంద్ర   వంశం వారుగా ఉండటానికి  ఎవరైనా ఎందుకు ఇష్టపడ్డారు ? చంద్రుడు సూర్యునికి ముఖ్య అనుచరుడు  అయినట్లుగా - మేము సూర్య వంశము వారికి ముఖ్య అను చరులము  - వారితో తగాదాలు లేకుండా సర్దుకు పోవటానికి మేము  సిద్ధ పడి ఉన్నాము అని చెప్పుకో దలిచిన వారు  చంద్ర వంశము స్వీకరించటానికి   అంగీకరించారు .} {ఇది ఇరు వంశాల మధ్యా శాశ్వత సంధి వంటిది  అనుకోవచ్చు  ?}

రక్తము అనేదే   ప్రాణము అని వైద్యులు అందరూ తీర్మానించుకున్నారు . దాని ఆధారంగా వైద్య శాస్త్రము

రాసుకున్నారు . తాము రాసుకున్న దానికి భిన్నముగా వైద్యము చేసిన , వారు ఎవరైనా సరే , మరింకొకరి మృతికి కారణము అయినట్లయితే - వారిని హత్యా అభియోగము కింద విచారించ వచ్చునని ఈ శాస్త్రము రాసిన ఈజిప్టు వైద్యులు తీర్మానించి, రాజుకు నివేదించారు . అదే రూలు ఇప్పటికీ వుంది .

మొగ డాక్టర్ లతో పాటు స్త్రీలు " వంట ఇంటి వైద్యము చేయటము కూడా ప్రారంభము అయ్యింది . వీరి గురించిన రికార్డు B .C. 2500 నుండీ లభ్యము అయ్యింది . ఈజిప్టు చెక్రవర్తి mentu hotep అనే అయన భార్య సమాధిలో 06 రకాల కూజాలు దొరికాయి . ఒక దానిలో జిప్సం - మిగిలిన వాటిలో - పాము శరీరపు పొలుసులు - చెట్ల వేరుల పొడి , తెల్లని బట్ట పీలికలు - మందు కలపటానికి వాడే చెంచాలు దొరికాయి . ఇవి ఆమె ఆస్తి కాబట్టి ఆమెతో పాటే సమాధి చేశారు .ముడి లోహం గా వున్న జిప్సం ను కాషాయముగా కాచి నాక, ఈజిప్టు వారు దానిని - జ్వరాలకు , వంటి నొప్పులకు, వాపులకు , నోటి ద్వారా ఇచ్చే ముందుగా వాడేవారు .ఇహ పాము చర్మపు పొలుసులు "కేరాటిన్" అనే ప్రోటీన్ తో నిండి ఉంటాయి. కేరాటిన్ - మనిషి గోళ్లను ,జుట్టును , చర్మ సౌందర్యాన్ని కాపాడుతుంది . చిన్న గ్యాయాలను మాన్పిస్తుంది . అందు

వలన ఆ స్త్రీ ఆ జాడీ లోని పదార్ధాలను తన ఇంటి  వైద్యం కోసం, తన అందం కోసం  వాడిందని ఊహించారు . ఆమె వాడింది కాబట్టి, స్త్రీలలో ఆమె ఏ  మొదటి బ్యూటీషియన్ .మరియూ   మొదటి వైద్యురాలు. ఈమె పేరు Neferu II . మొదటి తరంలో మేకప్ వేసుకున్న స్త్రీ పాము కుబుసాన్ని మెత్తగా నూరి టాల్కమ్ పౌడరు  లాగా పూసుకుని ఉంటుంది అని వూహించుకంటే మీకు ఎలాగనిపించిందో ఏమిటో నాకు చెప్పండి .

సేకరణ రచన వివరణ వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

9. వైద్య శాస్త్రపు  హిందువులు .      13-06-24

ఈ  విషయం లోకి నేరుగా వెళ్ళే ముందు కొన్ని అదనపు విషయాలను తెలుసుకోవటం మన లక్ష్యంగా పెట్టు కుందాము .

వైద్య శాస్త్రపు దృష్టిలో హిందువులు అనగా ఆర్యుల జాతి అని విస్తృత అర్ధము.   --ఆర్యులు --  ఇండో యూరోపియన్లు,   ఇండో జర్మనిక్లు  అని రొండు రకాలు . ఇండో- అనే మాట ఒక జాతి యొక్క పేరుకు  ముందు ఉంటే - వారు ఎదో ఒకప్పుడు భారత దేశముతో ఎదో ఒక

సంభందం కల వారని అర్ధం . . మన సంస్కృత భాష లోని మాటలు వారి భాషల్లోనూ ఉంటాయి . అదే మన కూ వారికీ వున్న సంభందం .
{01 .} 4000 to 1000 బీసీ లలో ఆర్యులు అంటే - హిమాలలయాలకు ఆవల వున్న హిందువులు లోనుండి కొన్ని సమూహాలు -ఆహారము , పశువులు మేపటానికి కావాల్సిన పచ్చిక మైదానాలను -వెతుక్కుంటూ అనేక దూరాలు ప్రయాణించారు . యూరోప్ ఖండం లోకి ప్రవేశించిన వారు ఇండో యూరోపియన్ లు అయ్యారు . వీరి భాషలు సంస్కృత భాషను పోలి ఉండటంతో - వీరు ఆర్యులలో నుండి వచ్చిన ఒక సమూహామని - గుర్తించారు . {02 } జెర్మనీ యూరోపు ఖండములోనే వుంది . .ఇండో జెర్మన్లు అంటే ఇండో యూరోపియన్ ల నుండి విడిపడిన మరొక పెద్ద సమూహాము . జర్మన్ భాషకు సంస్కృతం కి పోలిక ఉంటుంది . జర్మన్లను అతి పురాతనకాలము నాటి ఆర్యుల సంతతి అని భావిస్తారు {03 }ఇరాన్ లో మాటాడే పర్షియన్ భాషకు, ఇరాక్ లో మాట్లాడే పరిషియన్ భాషకు - ఆఫ్గనిస్తాన్ లో మాటాడే పర్శియన్ భాషకు - తజబికిస్తాన్ లో మాట్లాడే తజిక్ భాషకు , సంస్కృత భాషతో సంభందాలు ఉంటాయి . అందువల్ల పర్షియన్ భాష మాట్లాడే వారిని కూడా పురాతన ఆర్యులు అని భావిస్తారు . ఈ రకంగా - ఇండియా లోనూ , పర్షియా లోనూ , జెర్మనీలోనూ

యూరోప్  అంతటా హిందూ ఆర్యులు విస్తరించి వున్నారు  - ఆర్యులే హిందువులు అనుకంటె వారందరూ కూడా హిందూ మూల జాతిగా కల జాతి వారే .
భారతీయులు   వేదాలను ప్రమాణంగా స్వీకరించిన వారు. వేదాలు అనగా " బహిర్గతము చేయ బడిన విజ్ఞ్యానము "అని అర్ధం .  జెర్మన్లు మన వేదాల మీద ద్రుష్టి కేంద్రీకరించి పెట్టి ,ఈ నాటి విమానాలు తయారు చేశారని చదువు తాము . అసలు జెర్మన్లకు , వేదాలు చదవాలి అని ఎందుకు అనిపించిందో కూడా తెలుసుకుందాము .
గోథిక్ అనే భాష   సంస్కృత భాషకు పుట్టిన శిశువు వంటిది . క్రీస్తు శకం 300 - నుండీ 1000  వరకూ చలామణి లో వున్న గోథిక్ భాష  - ఆపై వాడకం కోల్పోయింది . మనకు సంస్కృత భాష ఎట్లాగయ్యిందో - జెర్మన్లకు గోథిక్ భాష అట్లాగా అయ్యింది .తమ పురాతన భాష ఐన గోథిక్ భాషని చదవటం మరియూ దానిలోని సూక్ష్మాలను  అర్ధం చేసుకోవటం కోసమని జెర్మన్లు సంస్కృతాన్ని చదివారు  - ఆపై తమ జాతికి హిందూ దేశానికి వున్న - భందాలనూ అనుభందాలను గుర్తించి ఆపై వేదాలను చదివారు .
ఋగ్వేదము  B. C. 2000 - 1000  లో సృష్టించ  బడింది .ఈ వేదము లో మూలికలు మరియూ మూలికలు కలిపిన నీటి యొక్క గొప్పతనము మరియూ

వైద్యులకు సంభందించిన ప్రస్తాపనలు వున్నాయి .
ఇందులోనే -క్షయ మరియూ కుష్టు వ్యాధుల ప్రస్తాపన
కూడా  వున్నది .
అథర్వణ వేదము 700 B . C. లో రోపొందినది .ఇది
మంత్రం రూపకంగా వున్న జ్ఞ్యానము . దీనిలో అనేక రకాల
జ్వరాలను , వంటి మీద వచ్చే బొబ్బలను ,  గడ్డలను
మాన్చటానికి గానూ ,    చదవ వలసిన మంత్రాలు
వున్నాయి .  అన్ని జ్వరాలను జబ్బులను కలిగించే ది
దుష్ట సెక్తి ఏ అన్న ఉద్దేశ్యమూతో   "ఓ  దుష్టశక్తీ నీవు పోయి
మెరుస్తూ వున్న ఆయుధాలకు బలి అవ్వు,  నీవు
ముజావత* పర్వతాల ను దాటి పారిపో, వెళ్లి అక్రమ
సంబంధాలను నెరిపే వారిని ఆశ్రఇంచు , అనే విజ్ఞప్తి తో
కూడిన ప్రార్ధన మంత్రాలు ఉంటాయి *{ ముజావత
పర్వతాలు = నేటి  టిబెట్ కి అవతల వున్న పర్వతాలు -
దేవతలు తాగే సోమ రసము తయారు చేయటానికి
కావాల్సిన సోమ మూలిక  ఈ కొండలనుండే లభిస్తుందని
మన వారి lవిశ్వాసము. సోమా మూలికకు ముజావత అనే
పేరు కూడా ఉంది .  అందువల్ల సోమ మూలికలు  కల ఈ
పర్వతము ముజావత పర్వతము అయ్యింది }

దీని తరువాతి భాగము కూడా వుంది .

సేకరణ రచన సమర్పణ వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

10 వైద్యశాస్త్రము - హిందువులు . 14-06-24

మగధ రాజైన బింబి సారు డు తండ్రి యొక్క మరణ వార్త విని మూర్ఛ పోగా ఆయనను వెన్న నింపిన తొట్టిలో పడుకో పెట్టి ఆపై చందనపు గంధములో పడుకో పెట్టారని - అప్పుడు అయన తెప్పరిల్లి - తన తండ్రి మరణపు వార్తను - జీర్ణించుకొని - తండ్రి రాజ్యము చేపట్టాడని చరిత్రలో ఒక కథ రాసి వుంది . వెన్న మరియూ చందనము లు లేపనములుగా శరీరము పై రాయటం భారతీయ వైద్యం కనుగొన్న పద్ధతి .అనగా ఆయింట్మెంట్స్ ని మొదటిగా కనుగొన్నది భారతీయ వైద్యులే .

అధర్వణ వేదపు వైద్య మంత్రాలను చదివిన వారు బ్రాహ్మణులే కానీ - వైద్య విద్య బ్రాహ్మణుకు మాత్రమే అని ఏ కేటాయింపూ జరగ లేదు . ప్రపంచము అంతటా దేముని పూజారులే వైదుయులుగా మారుతూ వచ్చారు . కానీ భారతీయ ఆలయ పూజారులు మాత్రమూ వైద్యము ను వృత్తిగా స్వీకరించలేదు . స్వీకరించి ఉంటే? - బ్రాహ్మన పూజారుల లాగా , బ్రహ్మణ వైద్యులు అనే తెగ ఒకటి ఏర్పడి ఉండేది . బ్రహ్మంలలో , వంశ పారంపర్య అర్చకత్వాలు ,పురోహితాలు , ఉన్నట్లు వంశ పారంపర్య బ్రహ్మణ వైద్యులు కూడా వుండే వారు ..ఇలా ఏదీ

జరగ లేదు కాబట్టి వైద్య వృత్తి బ్రాహ్మణులకు వైద్య వృత్త్య కేటాయింప బడలేదని తేలుతున్నది .
ఇహ బ్రాహ్మణులు కూడా వైద్య వృత్తి ని ఆశించ లేదు . కారణము - వీరు వేదం ను సంరక్షించ వలసిన బాధ్యతలో ఉండి, అందుకే అంకితం ఐ పోవటం ఒక కారణం కాగా , వేదముల ను పరిరక్షిస్తున్నందుకు గానూ, రాజుల నుండి వీరికి ధన, కనకాల దొరకటం మరొక కారణము .
<><><>
హిందూ సమాజం లో వున్న చతుర్ వర్ణాల వారికి, ఎవరి విధులు వారికి వున్నాయి. కాబట్టి వైద్య వృత్తి ఎవరు తీసుకోవాలి అన్నది ప్రశ్నగా మారి -- సూద్రులు తప్ప ఎవరైనా సరే వైద్యము వృత్తి గా స్వీకరించ వచ్చును అన్నారు . బ్రిటీష్ వారి కాలములో వచ్చిన అలోపతి వైద్య విధానాన్ని - మ్లేచ్ఛుల వైద్య విధానము అంటూ భారతీయులు తిరస్కరించారు . మ్లేచ్ఛ అనే సంస్కృత పదానికి అర్ధము "వేదప్రమాణికం" కానిది అని , "అపవిత్రమైన" ("హీనమైన") వ్యక్తులు చేసేది అని. ఏది ఏమైనా చదువుకున్న వారు- శాస్త్రాలతో పరిచయం కలవారు బ్రాహ్మణులే కాబట్టి , వైద్యము చేసే పనిని రాజులు బ్రాహ్మణుల కె ఒప్ప చెప్పారు . బ్రాహ్మణులు యుద్ధాలు చేయటం నుండి మినహాయింప బడ్డారు కాబట్టి - అందుకు ప్రత్యుపకారంగా - గాయపడిన సైనికులకు వైద్య చికిత్స చేయవల్సిన భాధ్యత బ్రాహ్మలకే ఉన్నదన్న వాదము కూడా వచ్చింది . అందువల్ల కూడా వీరు వైద్యము నేర్చుకున్నారు .

జబ్బుల బారిన పడే వారిలో ఎక్కువాగా బ్రహ్మలే వుండే వారు. ఇక ఆనాటి సమాజములో వర్ణ వివక్ష వున్నదని వేరే చెప్ప నక్కర లేదు కదా . బ్రాహ్మడు కాని వాడు తనను ముట్టు కోవటానికి బ్రాహ్మణులూ ఒప్పుకోరు . రాజులుగా ఉన్న క్షత్రియులు కూడా తమ కంటే కింది వర్గము వారిని తమని ముట్టుకోనివ్వరు . ఈ సామజిక పరిస్థితిని బట్టి - బ్రహమలే ఐచ్చికంగా వైద్య వృత్రిని స్వీకరించ వలసి వచ్చింది కాబట్టి స్వీకరించారు.

బ్రాహ్మణుల ద్వారా వేదం విస్తరిలుతూ ఉండగా - అదే బ్రాహ్మణుల కారణంగా వైద్యము కూడా వేదానికి జోడింపు అయ్యింది . అలాగా ఆయుర్వేదము = జీవించటానికి ఉపయోగ పడే వేదము -- వుద్భవించింది . ఆయుర్ వేదము ఎదో ఒక్క పుస్తకపు పేరు కాదు . మనిషి జీవితము పై ప్రభావము చూపుతున్న అన్ని శక్తులనూ ఎదుర్కోవటానికి గానూ శాస్త్రాల్లో రాసిన అన్ని విషయాలనూ ఆయుర్వేదము కిందకు చేర్చారు .

ఈజిప్టు వారి మాదిరిగానే , భారతీయులు కూడా ఆరోగ్య శాస్త్రానికి దేముడిని జోడించారు .అయన పేరు ధన్వంతరి . సముద్ర మధనంనుండి బయటికి వచ్చాడు. అయన చేతిలో ఒక పుస్తకము , దేవతలు తినే ఆహారంతో నిండిన పాత్ర ఉంటాయి. విష్ణు మూర్తి యొక్క అంశ. ఎన్నో చోట్ల వున్న వైద్య విజ్ఞ్యానములోని సారాన్ని పిండి , క్రోడీకరించి మనకు అందించిన వాడు చరకుడు . ధన్వంతరి చెప్పగా - చరకుడు దానిని రాసుకుని గ్రంథస్థము చేసి హిందూ వైద్యులకు

ఇచ్చాడు . విదేశీ వైద్య శాస్త్ర వేత్తలు మన ధన్వంతరిని, గ్రీకుల వైద్యానికి దేముడు ఐన "స్క్యూలపిస్ " తో సరి సమాన మైన వాడి గా పోల్చి , ధన్వంతరి కి అంతర్జాతీయ గౌరవము కలిగించారు .

యుద్ధములు జరిగినపుడు అనేక మంది సైనికులు చనిపోతూ వుంటారు . అందరూ కూడా కత్తి దెబ్బలతోటే మరణించారా ? యుద్ధము చేయటానికి వచ్చిన వారిలో సహజ మరణాలు / అనుమానాస్పద మరణాలు ఉండవా ? ఉంటాయి కదా ? అయితే అది సహజ మరణమా ? లేక ఆ సైనికుని పై ఏదన్న విష ప్రయోగము జరిగిందా అనేది తేల్చ వలసి వచ్చినపుడు - రాజ వైద్యులు ఏర్పడ్డారు . ఈ రాజుల ప్రాపకం కింద మొదటి తరపు భారత వైద్యము విస్తరిల్లింది .
తమ పై విషాహార ప్రయోగం జరగటం అనేది ఆ నాటి రాజులకు ఉన్న పెద్ద బెడద .అందువలన విష ప్రయోగము జరిగిన రాజును ,లేదా అయన సైన్యపు యోధుల ను రక్షించటం ,అనేది భారతీయ వైద్యుల తొలి భాద్యత అయ్యింది . అందువల్ల వీరు శరీరం పట్ల విషంగా పనిచేసే పదార్ధాలగురించి - శరీరం పట్ల విష నివారణగా పని చేసే పదార్ధాల గురించి ఎన్నో విషయాలు తెలుసుకొని - సేకరించి పెట్టారు . ఒక్కమాటలో చెప్పాలంటే "విషాలు - వాటికి విరుగుడు " కనిపెట్టట మే వీరి పని అయ్యింది . ఆహారాన్ని విష తుల్య - అమృత తుల్య ఆహారముగా మన హిందూ వైద్యులే విడదీశారు .ఆయుర్వేదము చెప్పే " పచ్చము లేదా తిన గూడని ఆహార

పదార్ధాలు - ఈ విడతీత లోనుండి వచ్చాయి . అలోపతి వైద్యము ఆహార పదార్ధాలను విషము / అమృతము అనే విభాగాలు చేయలేదు కనుక అలోపతి వైద్యులు పచ్చము చెప్పరు . ఆయుర్వేద వైద్యులు పచ్చము చెపుతారు . అదీ విషయము .

భారతీయ వైద్యులే -విషము ల గురించిన చాప్టర్లను వైద్య రంగానికి అందించాబు . ఈ సమా చారాన్ని వేరే విధంగా అర్ధం చేసుకున్న ఆనాటి గ్రామీణులు . తమ జబ్బులు వచ్చినపుడు ,విష ప్రయోగమే అందుకు కారణం అనే నమ్మకానికి లోను అయ్యే వారు . ఏ విషము అయినా ఆహారము ద్వారానే కదా పెడతారు ? అనువల్ల ప్రతి చిన్న దానికీ "నాకు ఎవరో ఎదో మందు పెట్టారు" అని గ్రామీణ జనం భావించటం మొదలైంది . దీనిని ఆధారం చేసుకుని "మందు కక్కించే" కుహానా వైద్యులు కూడా వచ్చారు . ఎప్పుడో ప్రజలలో కలిగిన అంధ విశ్వాసాన్ని ఆసరాగా తీసుకొని - మందు { విషము } కక్కిస్తాము అనే వైద్యము ఇప్పటికీ వుంది .



Image of dhanvanthari .

రచన సేకరణ వివరణ వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

11.పురాతన భారతీయ  వైద్యుడి గురించి  .15-06-24

గత భాగంలో -- భారతీయ వైద్యులు-- విషాలు - దానికి విరుగుడులు అనే దాని మీదనే ఎక్కువ గా కృషి చేశారు, అని చెప్పి , దానికి గల కారణాలను కూడా వివరించాను .

ఇప్పుడు --భారత దేశపు పురాతన వైద్యులు - విషమును తొలగించేటందుకు పెట్టుకున్న నియమాలు ఏమిటో కూడా తెలుసుకుందాము -- 01 . విష ప్రయోగము నకు గురి ఐన వ్యక్తి అన్ని మతాలూ ఒక్కటే అనే వాడు కారాదు - 02 .రాజుపట్ల గౌరవము కలవాడై ఉండాలి { ఉదాహరణకు - ఓ వ్యక్తిని రాజ ద్రోహి అనుకున్నారు . అతని పై విష ప్రయోగము అయ్యింది . ఇలాంటి వారి లోని విషమును తొలగించే పనిని భారతీయ వైద్యము చేయదు - ఇంకా లోతుగా ఆలోచిస్తే రాజ ద్రోహము చేసిన వ్యక్తిని బ్రతికించటానికి హిందూ వైద్యము ప్రయత్నించదు అని ఇంకా ఆలోచిస్తే వైద్యము రాజులకు మద్దత్తుగా నిలిచింది అని కూడా అనిపిస్తున్నది } 03 . ఆ వ్యక్తి తన కర్తవ్యాలను చక్కగా నిర్వహించిన వాడై ఉండాలి { అనగా పిరికి పంద ఐ విషము సేవించిన వాడు కారాదు .వాడిని హిందూ వైద్యము ఆదు కోదు - ఎందుకంటే పిరికి పంద మరల మరలా విషము సేవించ వచ్చు - ఆరకంగా - వైద్యుని సమయాన్ని వృధా చేస్తాడు కాబట్టి . } 04 . విషము సేవించిన వారు దుష్ట శక్తుల భయానికి లోపడక -

దేముని ప్రార్ధనలు కొనసాగించుతూ ఉండాలి - 05 . తాను చేసిన ఎదో ఒక తప్పుడు పనిని కప్పి పుచ్చుకోవటానికి కూడా వ్యక్తులు విషము సేవిస్తారు ? . అటువంటి వ్యక్తి పట్ల విష నివారణ వైద్యము పని చేయాలంటే , ఆ వ్యక్తి తాను చేసిన తప్పుడు పని పట్ల పాస్చాత్తాపము పడుతూ ఉండాలి . 06 . అతని గ్రహ స్థితులను గుర్తించి -గ్రహాలను ప్రార్ధన చేసే జ్యోతిష్కుడు కూడా రోగి చెంతనే ఉండాలి - ఇవన్నీ వున్నపుడే విష ప్రయోగానికి గురి ఐన వారికి ప్రాణాపాయము తప్పుతుంది అని- అప్పుడు మాత్రమే విషానికి విరుగుడుగా ఇచ్చే మందు పని చేస్తుందని - భారతీయ వైద్యము చెపుతుంది .

సైన్యములో ఏదన్న వ్యాధి తల ఎత్తి నపుడు- రాజ వైద్యులు గొప్ప శ్రద్ధ తీసుకోవాలని , ముందుగా రాజకుటుంబము పట్ల ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలని - రాజ వైద్యుడు- వైద్య గ్రంధాలు మరియూ మందులతో సహా రాజు గారి యుద్ధ శిబిరం పక్కనే నివాసము వుండాలని - భారతీయ వైద్య శాస్త్రము నిర్దేశిస్తుంది .

ధర్మానికి నాలుగు పాదాలు వున్నాయి అన్నట్లుగా, వైద్యానికి కూడా నాలుగు పాదాలు వున్నాయి . వైద్యుడు - చెప్పినట్లు వినే రోగి - మందులు - సపర్యలు చేసే వారు

-అనే  ఈ నాలుగు  వైద్యానికి నాలుగు కాళ్ళ లాంటి వారు .
ఈ నాలుగు  వున్నపుడే -- నాలుగుకాళ్ళ బల్ల లాగా  రోగి ఆరోగ్యము స్థిరంగా నిల బడుతుంది.   ఇందులోని నాలుగవ కాలు ఐన సపర్య ఆనేది   లోపించినపుడు - వైద్యుడే ఆలోటుని భర్తీ చేయాలని - నాలుగో కాలు లాగ వ్యవహారించా లని  - భారతీయ వైద్య శాస్త్రము నిర్దేశిస్తుంది .

 వైద్యుడు అనే మొదటి కాలు లేకుండా మిగతా వన్నీ నిష్ప్రయోజనం అని --అనగా నొంత మందులు నొంత ఉపసమానాలు నిరర్థకము అని ,భారతీయ వైద్య శాస్త్రము చెపుతుంది . దీనికోసము అని, వైద్య శాస్త్రము  ఒక ఉదాహరణ కూడా చెప్పింది  .  యజ్ఞము చేసి బలి ఇచ్చేటప్పుడు-  రిగ్వేదము సామవేదము చదివే వారు ఉండాలి. వీరికి తోడు యజుర్ దము చదివే వారు కూడా ఉండాలి . అప్పుడే యజ్ఞము సఫలము అవుతుంది . అదేవిధంగా  తానూ - మందులు- చెప్పిన మాట వినే రోగి అనే ఈ  ముగ్గురూ ఉంటేనే వైద్యము విజయవంతము ఐ రోగి కోరిన  ఫలితాన్ని ఇస్తుంది .

ఇహ రోగము అనేది ఒక పడవ .రోగి అనేవాడు ఆపడవలో కూచుని ఏటో సాగి పోతూ వున్నాడు . ఒక్కోసారి మరణము వైపు కూడా కావచ్చును .  వైద్యుడు , రోగము అనే పడవ

యొక్క చుక్కాని వద్ద కూచున్న సరంగు  వంటి వాడు .
అయన తన జ్ఞ్యానము అనే చుక్కానితో  రోగిని - తిరిగి
భూలోక మునకు చేరుస్తాడు .

శాస్త్రములో మర్మాలను తెలుసుకున్న వాడు - సస్త్ర
చికిత్సలలో  పాలు పంచుకున్న వాడు - చేతి కింద
ఎప్పుడూ  మనిషిని కలిగి వున్నవాడు - మనస్సులో
నిజాయతీ వున్నవాడు - గుండె ధైర్యము వున్నవాడు - తన
మందులు - వైద్య గ్రంధాలను వెంట తీసుకుని తిరుగు తూ
వుండే వాడు , అప్పటికపుడు అలోచించి నిర్ణయము
తీసుకో గలిగిన వాడు  - వీరు మాత్రమే ఉత్తమ వైద్యులు
అవుతారు  . రోగి పై లాంటి ఉత్తమ వైద్యుని   ఆశ్రయించాలి .

సేకరణ వివరణ రచన వారాణసి శ్రీ రామ కృష్ణ అఫ్
అమరావతి

**12.**భారతీయ వైద్యము **-** రోగి    16-06-24

భారతీయ వైద్యము అనగా ఆయుర్వేదము అనే అర్ధము ,
ఇంతకు మునుపు మనము వైద్యుడు ,రోగి, మందులు,
మరియూ రోగికి శుశ్రూష చేసేవారు - అనే నాలుగు   -
చికిత్స విజయవంతము కావటానికి  మూల స్తంభాల

వంటి వి  అని తెలుసుకున్నాము .మొదటి స్తంభము  ఐన వైద్యుడికి వుండవల్సిన లక్షణములు ఏమిటో కూడా గతం లోనే చెప్పుకున్నాము .  రోగము తో మూలిగే రోగి ,ఒక మూల స్తంభము లా వుండాలని ఎలా ఆశించారో  ఇప్పుడు చూద్దాము .

చికిత్స విజయవంతము అవ్వటానికి అవసరమైన రెండో మూలస్తంభము వంటి   రోగికి ఇలాంటి  లక్షణాలు ఉండాలి . 01. వంటి లోని ముఖ్య శక్తీ-- అనగా ప్రాణాలు అనేవి నిలిచి ఉండటానికి  కారణము అవుతున్న  శక్తి ఎదో అది కొద్దిగానైనా సరే రోగి  దేహంలో నిలవ ఉండాలి   . o2. రోగికి నొప్పిని తట్టుకునే గుణము నశించి పోకుండా ఉండాలి     . 03 . మందు లేని  రోగము వున్న -రోగి కాకూడదు      04 .రోగి  అతి పేదరికము లో  ఉండరాదు 05 .రోగికి తిండి మీద వ్యామోహము నశించి పోయి ఉండాలి . 06 . రోగి  వైద్యుని మీద నమ్మకం కలిగి ఉండాలి 07 .రోగి  వైద్యుడు ఇచ్చిన మందుమీద నమ్మకం కలిగి ఉండాలి o8. రోగి వైద్యుడు ఇచ్చిన సూచనలను గౌరవము తో పాటించాలి .

చికిత్స విజయవంతము అవ్వటానికి అవసరమైన మూడో మూలస్తంభము వంటి"మందు" ఇలా ఉండాలి . 01 . మందు కోసము వాడే ఔషధీ మొక్క - మంచి

సారవంతమైన నేలనుండి సేకరించిన ది  అయ్యి ఉండాలి 02 . మూలిక పవిత్ర మైన రోజున నే సేకరించిన్నది  అయ్యి ఉండాలి . 03 . మందు సేవించవల్సిన మోతాదు- సమయము చక్కగా నిర్ణయింప బడి ఉండాలి .o4. మందు తాజా గా తయారుచేసుకొచ్చినది అయి ఉండాలి -

చికిత్స విజయవంతము అవ్వటానికి అవసరమైన నాలుగో మూలస్తంభము వంటి -- రోగి యొక్క సేవకునికి ఇలాంటి లక్షణాలు ఉండాలి .  01 .  మంచి మనసు ఉండాలి {అనగా వీడు చస్తే పీడా పోతుంది - నాకు ఆస్థి దక్కుతుంది అనుకునే వాడు రోగికి సేవకుడు కాకూడదు }  02 . అవసర మైనపుడు సిగ్గును విడనాడే వాడు అయ్యి ఉండాలి { అనగా - మర్మావయవాలను శుభ్రం చేయ వలసి వస్తే అది కూడా చేసే వాడు అయ్యి  ఉండాలి }  03 వైద్యుడు ఇచ్చిన సూచనలను అర్ధం చేసుకో గల వాడై ఉండాలి . 04 . అత్యుత్సాహముతో, అనవసర సమాచారాన్ని వైద్యునికి నివేదించే వాడు కా కూడదు  { అనగా రోగి చెప్పని బాధను-  తాను ఊహించి  రోగితరఫున వైద్యునికి చెప్పే వాడు కాకూడదు }

సర్జెరీ కూడా చేసిన ప్రధములలో, హిందూ వైద్యులు  ఒకరు .  తెగిన ముక్కు స్థానంలో మరొకటి అమర్చటం అనేది భారతీయ వైద్యులు  ఎక్కువుగా చేసిన సర్జెరీ .  తెగిన

ముక్కు స్థానంలో కోడి యొక్క కాపాలాన్ని { మనిషి తల మీద వున్నది కపాలం అలాగే కోడి తల మీద వున్నది కోడి కపాలం }, తెగిన ముక్కు మీద ని పెట్టి కుట్టి - ముక్కును సరి చేసే వారు . ఈ ఆపరేషన్ లే ఎక్కువగా జరిగాయి? అంటే? అప్పటి రోజులలో భార్యలకు భయపడే భర్తలు? తమ ఏక పత్నీ వ్రతాన్ని నిరూపించు కోవటానికి అని , తమకు ఆకర్షణీయంగా కనపడ్డ స్త్రీల మీద - " ఆమె నన్ను ఆకర్షించటానికి వచ్చింది - నేను కాదన్నాను " అనే అభియోగం /నేరం మోపి - ఆ స్త్రీ యొక్క ముక్కు కోసేసే వారు. ఆకర్షించటానికి ప్రయత్నించిన స్త్రీ ముక్కు కోయటం -- చివరికి ఒక శిక్షా పద్ధతి లాగా మారింది . "నేను ఏక పత్నీ వ్రతుడను " అని చెప్పుకోదలిచిన పురుషులు కూడా ముక్కులు కొస్తుండే వారు . ఎన్ని ముక్కులు కోస్తే అంత గట్టి ఏక పత్నీ వ్రతుడు అని లెక్క . "వాడు ముక్కులు కోసి వేస్తాడు" అని పేరు పడ్డ పురుషుడిని ఆకర్షించటానికి ఇక ఏ స్త్రీ కూడా ప్రయత్నించదు కదా ? పురుషులు చేసే ఈ కత్తిరింపుకు . స్త్రీల మద్దత్తు కూడా దొరికింది . ఎందుకో మీకూ తెల్సు ను . {ఈ నేపధ్యమును బట్టి , సూర్పనఖ ముక్కు తెగటం అనే సంగతి ని విశ్లేషించు కొండి .{ ఇలాగా

-- వైద్య శాస్త్రము ద్వారా కూడా మనకు  కొన్ని చారిత్రక వివరణలు  తెలుస్తూ ఉంటాయి

. BY varanasi sree rama krishna of amaravathi

**13.** భారత ఆయుర్వేద  వైద్య**-** శాస్త్రాలు  **18-06-24**

ఆయుర్వే దానికి పునాది గ్రంధాలు మూడు .01 . భేల సంహిత  02 . చరక-సంహిత , 03 . సుశ్రుత సంహిత . {అదనపు విషయము  సంహిత అన్న మాటకు అర్ధం "ఓ క్రమ పద్ధతిలో పోగుచేయ పడ్డ - క్రోడీక రింప బడిన - జత కల్ప బడిన - వచనములు లేదా శ్లోకములు . సంహిత అనగా వేదములో ఉన్న జ్ఞ్యానములోని అతి పురాతన విషయము అని కూడా అర్ధము . అందువల్ల సంహితలలో వేదపు మంత్రాలు  కూడా ఉంటాయి . వేదము లోని విషయాలు పదే పదే వల్లే వేయబడినట్లుగా సంహితలలో ని విషయాలు కూడా పదే పదే వల్లే వేయ బడతాయి . వేదములో వుండే ఆశీర్వాదాలు సంహితాలలో కూడా ఉంటాయి .}

01 . భేల  సంహిత - భేల అనే మునిచే 100 BC to 400 మధ్య రాయబడింది .భేలుడు "పునర్వసు ఆత్రేయ" అనే మునికి  శిష్యుడు “ భేలుడుకి" సమకాలీకుడైన "అగ్నివేశ ” అనే  ముని "అగ్ని వేష సంహితా" అనే ఆయుర్వేద వైద్య

గ్రంధము రాసాడు .ఇది అర్ధం చేసుకోవటం చాల కఠినంగా వుండటాన - చెరక ముని దానిని పరిష్కరించి / సంస్కరించి చరక సంహిత రాసాడు .

02 . చరక సంహిత- రోగాలక్షణాలు - చికిత్సలు గురించి చెబుతుంది . అంతే కాక ఆనాటి భారతీయ భౌగోళిక పరిస్థితులు- ఆర్ధిక సామాజిక పరిస్థితుల గురించి కూడా చెప్తుతుంది .

03 . సుశ్రుత సంహిత- ముఖ్యంగా శస్త్ర చికిత్సా ఫధ్ధతుల గూర్చి చెబుతుంది . ఈ సెస్త్ర చికిత్సల గురించి శుశ్రుతుడు ప్రస్తావించాడు . నరాల వ్యాధులగురించి , కంటి దృష్టిలో కీలకంగా వున్న supra- orbital nerve గురించి కూడా సుశ్రుతుడు తెలిపాడు . {సుప్రా ఆర్బిటల్ నరము -- కంటి సాకెట్లో నుండి కనుబొమ్మల కింద నుండీ నుదిటి పైకి విస్తరించిన నరము .} .ఈయన పొట్ట మరియూ అందులోని పెద్ద పేగులు అనే విషయాలకు చెందిన సర్జికల్ నాలెడ్జిని కూడా వైద్య శాస్త్రానికి జోడించాడు . ఒక వందకు పైగా వున్న రక రకాల సస్త్ర చికిత్సా పరికరాలను గురించి కూడా వైద్య శాస్త్రానికి తెలిపాడు . ఈయన రాసిన సుశ్రుత సంహిత (: सुश्रुतसंहिता , : Suśrutasaṃhitā ) ఔషధం మరియు శస్త్రచికిత్సకు సంబంధించి --. ఇప్పటికీ మనుగడ లో వున్న పురాతన సంస్కృత గ్రంథాలలో ఒకటి. సుశ్రుతుడు

క్రీ.పూ. 6వ శతాబ్దానికి చెందినవాడు. వారణాసిలో జన్మించాడు.
"జలగలతో వైద్యము" చేయటము సుశ్రుతుడి ప్రతి పాదన . జలగ వైద్యుని యొక్క చేయి వంటిది అని ఈయన చెప్పాడు .
భారత దేశంలో కనపడే అన్ని రకాల జలగలనూ చెరకుడు గుర్తించాడు. {జలగ చిన్నదే కానీ దాని చెరిత్ర గొప్పది .వాటి గురించి రాద్దాము అనికొని- కూడా వదిలి వేసాను }
అరబ్బులు భారతీయుల జలగల వైద్యానికి అత్యంత గౌరము ఇచ్చి దానిని తమ వైద్య శాస్త్రములో ఒక భాగము చేసుకున్నారు

1.THE IMAGE OF AGNIVESHA MAHARISHI2. IMAGE OF CHARAKA MAHARISHI 3.IMAGE OF PUNARVASU BHARDVAJA WITH HIS SISHYA .4. IMAGE OF SUSRUTHA - THE FATHER OF INDIAN SURGERY


PUNAR VASU BHARDHWAJA TEACHING MEDICHINE TO HIS DISIPLES / PUPIL


SUSRUTA THE FATHER OF SURGERY



IMAGE OFsupra- orbital Nerve

**14."భారతీయుల మొదటి -హాస్పిటల్స్ " 19-06-24**

ఇప్పడు ఆయుర్వేద పైద్యము ఆయుర్ వేదపు మందులు జనానికి ఎలా చేరువ అయ్యాయో చూద్దాము -

B C. 3 27, నాటికే ఆయుర్వేదపు మందులు వున్నాయి .
ఆయుర్వేద మందులులో రకాలు - కింద విధము .
01 . Swarasa, స్వరస - అనగా అప్పటికి అప్పుడు తయారు చేసిన మూలికా సారము 02 .Kashaya,కాషాయ అనగా - చిక్క బరచ పడిన మూలికా సారము .

03 .Churna, - చూర్ణము అనగా = పిల్లలు వయో వృద్ధులు సేవించటానికి వీలుగా తయారు చేసిన మూలికల పొడి 04 .Guti-Vati, గుటి మరియూ వాటి అనగా నేడు మనము మింగుతూనే ఆయుర్వేదపు టాబిలెట్లు . గుటిక అంటే గుండ్రంగా వున్నా టాబ్లెట్ . వటిక అంటే పొడుగ్గా వున్నా టాబ్లెట్ 05 . Asava-Arishta, ఆసవా-- అరిష్ట -అనగా చెక్కర లేదా బెల్లం లో పులిసేదాకా ఉంచిన ఆయుర్వేద మూలికా మందు. టానిక్ . 06 .Avaleha, మొత్తం రోగనిరోధక శక్తికి మద్దతునిచ్చే లేహ్యాము - ఛవ్యన ప్రాస వంటిది .ఛవ్యన ప్రాస ముందస్తు వృద్ధాప్యాన్ని నివారిస్తుంది అంటారు ·
07 .Ghrutam-Tailam etc.ఘృతము - తైలము -- ఘృతము అనే మందు దేశవాళీ నేతి తో కలుపుకొని తిన వలసిన మందు . తైలము - అంటే - ఆయుర్వేదపు మూలికలు కలిసిన నువ్వుల నూనె.ఇది పూసుకోవాల్సినది
.
{నా అభి ప్రాయము - ఆయుర్వేదము మూలికలనే చూర్ణం చేసింది కానీ దేనికీ కూడా స్వర్ణము /బంగారాన్ని కలప మని చెప్ప లేదు } { స్వర్ణ లేహ్యం/ స్వర్ణ భస్మం అంటే - నాణ్యతలో మొదటి తరగతి కి చెందిన మందు అని మాత్రమే అర్ధము )

బౌద్ధులకు స్వర్ణయుగము అన తగిన కాలమే ఆయుర్వేదానికి కూడా స్వర్ణయుగము. బుద్ధిజం ఆయుర్వేదాన్ని బ్రాహ్మణులనుండీ , వారు ఏర్పరిచిన నియమ నిబంధనల నుండీ బయటకు తీసుకు వచ్చింది . వైద్యులకు రాజులను మించిన గౌరవము ఇచ్చింది . చివరికి బుద్ధుని కి భైసజగర్వుడు అన్న రూపం కూడా ఇచ్చింది . మునుపటి రాజులు వైద్యులకు ఇచ్చిన గౌరవము కన్నా ఎక్కువ గౌరవము ను- బౌద్ధము ను అనుసరించిన రాజులు , చెక్రవర్తుల ద్వారా వైద్యులకు ఇప్పించింది . అంటే తన బోధనల ద్వారా ఆయుర్వేద వైద్యుల యొక్క ప్రాముఖ్యతను అందరి మదిలో నూ నాటింది .

అప్పటిలో ఆయుర్వేద వైద్యము , మందులు , వాటికి అయ్యే ఖర్చు దృష్ట్యా సామాన్యుల కోసము కాదు అన్నట్లు గా ఉండేవి. అప్పుడు బౌద్ధులు -01 రాజు 02 .-నది 03 .ధనవంతుడు 04 .గురువు 05 . వైద్యుడు అనే ఐదూ అందుబాటులో లేని చోట , ప్రజలు నివసించే వద్దని ప్రచారం చేశారు .వైద్యుడు లేకపోతే , జనావాసాలు ఖాళీ అయిపోతాయి పట్టణాలు మాయం అయి పోతాయని అని భయపడిన రాజులు - ముఖ్యముగా బౌధమతము స్వీకరించిన రాజులు - వైద్యులు- వైద్యము- ప్రజలు అనే కోణములో అలోచించి- వైద్య రంగము మీద గురించి

కొన్ని శాసనాలు చేశారు . ఇందులో అశోక చక్రవర్తి శాసనాలు ప్రముఖమైనవి .

అశోక చెక్రవర్తి బౌద్ధ మత  అవలంబకుడు కాబట్టి, వైద్యము గురించి  బౌద్ధ మత ము చేసిన బోధనలను అనుసరించి కొన్ని శాసనములు రూపొందించాడు .  సుశ్రుతుడు వేటగాండ్లకు, ఉచ్చులు పన్ని జంతువులను పట్టే వారికీ . ఒక్క క్షణంలో జంతువుల పీకలను కోసి చంపే వారికీ వైద్యము చేయకూడదు అని చెప్పాడు .  దీనిని ఖండించటానికా  అన్నట్లు , అశోకుడు "ప్రతి ఒక్కరికీ వైద్యము అందాలి "అని "జంతు హత్య కూడదు" అని శాసనములు  ప్రకటించాడు . అంతే కాక  పశువుల కోసము అని ఒకటి ,  మనుషుల కోసము అని మరొకటి ఇలా రెండు రకాల  వైద్య విధానాలు వుండాలని కూడా శాసనము చేసాడు . ఇట్లాగా -  మానవులు సర్వజీవుల పట్ల కరుణా భావాన్ని కలిగి ఉండాలి అనే బుద్ధుని బోధనలను అశోకుడు అమలు పరిచాడు . అశోకుడు అనేక ఆయుర్వేదపు ఔషధ మొక్కలను తన రాజ్యములో పెంచటానికి అవసరమగు ఏర్పాట్లు  కూడా చేసాడు .{ నా అభిప్రాయము - మన చిన్నపుడు వున్న  సోషల్ పాఠములో అశోకుడు చెట్లు నాటించెను - అనేదిఒక స్టాండర్డ్ పాయింట్.  దీనికి ఒక మార్కుడెఫినిట్  . ఇప్పుడు చూస్తే

అయన నాటించినవి అన్నీ కూడా  నీడ నిచ్చే చెట్లు కాక పోవచ్చు ననీ- అందులో ఎక్కువగా  ఔషధ మొక్కలు లేదా ఓషధీ చెట్లు కూడా  వుండి వుంటాయని నాకు అని పించింది . లేక పోతే "అశోకుడు చెట్లు నాటించెను " అన్న వాక్యము ను మనకు పాఠము గా చెప్పే వారు కాదు అనుకుంటాను . మనము ఆయుర్వేదపు ప్రాముఖ్యాన్ని చిన్న తనంలోనే గుర్తించటానికి వీలుగా - అశోకుడు చెట్లు నాటించెను అనే పాఠం పెట్టారు }

అశోకుడే హాస్పిటల్ అనే వ్యవస్థకు రూపకల్పన చేసి , ఆయుర్వేదపు వైద్యాన్ని సాధారణ ప్రజలకు అందుబాటులోకి తెచ్చాడు . ఈ హాస్పిటల్ వ్యవస్థ కు అనుబంధంగా  -  వైద్య కళాశాలలు   కూడా అశోకుని కాలం లోనే ప్రారంభము అయ్యాయని భావిస్తారు . ఇవి అన్నీ కూడా మొత్తంగా  అశోకుని కాలం లోనే జరగపోయినప్పటికీ , - అశోకుని ఆలోచనలు, శాసనాలు , ఆయుర్వేద వైద్యము ప్రజల వైద్యముగా మారటానికి కారణం అయింది .

బుద్దిస్టులుగా మారిన చైనా వారు ఇండియాని సందర్శించి " భారత దేశములో "రోగుల పట్ల జాలిని చూపే ఇండ్లు { houses of mercy for the sick } అనేకం , అనేక చోట్ల .

భారత దేశము అంతటా  ఉన్నాయని , సూరత్ అనే చోట పెద్ద పశువైద్య కేంద్రము ఉన్నది అని రాసారు .

సేకరణ రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి  .

**15.**భారతీయ వైద్యపు **-** విదేశీ  ప్రయాణము
20-06-24

సింహాళీయులకు  "మహావంశం"  అను చారిత్రక గ్రంధము వుంది . ఈ పుస్తకము ప్రకారము "దుత్త గమని" అనే రాజు తాను మరణించి బోయే ముందు - తాను చేసిన మంచి పనుల గురించి తనకు ఒక సారి వినిపించమని కోరతాడు . ." అప్పుడు వారు "రాజా మీరు ప్రతి నిత్యమూ 18  వైద్య శాలల వంతున పర్యటిస్తూ - అక్కడ వారికి  తగు ఆహారము అందుతూ ఉన్నదా ? లేదా ?వారికోసం వైద్యులు మందులు రూపొందిస్తూ ఉన్నారా?లేదా ?  అని పరిశీలించారు .మీరు మహారాజు అగు బుద్ధ దాసుడు ని అనుసరించారు  " అని తెలుపుతారు .

బుద్ధ దాసుడు సింహాళ దేశపు రాజు . ఈయన ఆయుర్వేద వైద్యమును - శస్త్రచికిత్సలనూ అభ్యసించిన రాజు .  భారత

బుద్ధిస్టులు శ్రీ లంక లో ప్రవేశించి - ఆయుర్వేద వైద్యము ను అక్కడ ప్రవేశ పెట్టారు - ఈ వైద్య విధానము గురించి అనేక పుస్తకాలు రాసారు. రాజు వాటిని చదివి , ఆదరించి తానే వైద్యుడు అయినాడు . ఆయుర్వేదము మరియూ బుద్ధిజం కలసి ఒక విడదీయరాని జంటగా శ్రీలంక అంతటా విస్తరించింది . బుద్ధ దాసుడు బౌద్ధ ధర్మాలను అనుసరిస్తూ - రోగులను సందర్శిస్తూ - వారికి ఔషధాలను సమకూర్చాడు . ఇట్లా గా బుద్ధిజం తాను స్వర్ణ యుగము అనుభవిస్తూ ఆయుర్వేదానికి కూడా స్వర్ణయుగము కల్పించింది . బౌద్ధులు ఆయుర్వేదాన్ని ప్రపంచానికి పరిచయం చేశారు . భారత దేశపు ఎల్లలు దాటించారు . బుద్ధ దాసుడు స్వయంగా చేసిన వైద్యము గురించిన జానపద కథలు ఉన్నాయి .ఒక కథ ప్రకారం పల్లెలో వున్న ఒక బౌద్ధ సన్యాసి నీటి తో పాటు కప్ప గుడ్లను త్రాగుతాడు. ఆగుడ్డు అతని తలలోకి ప్రవేశించి కప్పగా మారుతుంది . వర్షం కురిసినపుడెల్ల ఈ కప్ప బెక బెక లాడి బౌద్ధ సన్యాసి తలలోకి నరకాన్ని ప్రవేశ పెట్టేది . అప్పుడు బుద్ధ దాసుడు ఒక సస్త్ర చికిత్స ద్వారా సన్యాసి యొక్క కాపాలాన్ని రొండు గా విడదీసి - కప్పను తీసి వేసి - పుర్రెను మరలా యధావిధిగా అతుకుతాడు .
పై కథలో నిజము సంగతి ఎట్లా వున్నా - బౌద్ధం వల్ల శ్రీలంక లోని పల్లె పల్లెలకూ ఆయుర్వేదపు వైద్యం అందుబాటులోకి

వచ్చిందని, ఈ జానపద కథ చెపుతుంది . బుద్ధదాసుడు తనకు లభించిన ఆయుర్వేద వైద్య విద్యను అంతా ఒకే చోట క్రోడీకరింప చేసి దానిని సింహళ దేశము అంతా అమలు చేసాడు . ప్రతి ఫది పల్లెలకు ఒక వైద్యుని ఏర్పరిచి , వారి పోషణ నిమిత్తము 20 అగ్రహారాలు కేటాయించాడు {భారత దేశములో ఇలాంటి అగ్రహారాలు ఉన్నట్లు కనపడవు- దీనిని బట్టి ప్రజా వైద్యము హిందూ రాజుల సృష్టి కాదు అని } బుద్ధ దాసుడు ఏనుగులు, గుర్రాలకు కూడా వైద్యము ఏర్పాటు చేసాడు . పిచ్చి వారికి వికలాంగులు గ్రుడ్డి వారికి కూడా ఆసుపత్రులు ఏర్పాటు చేసాడు . ఇదంతా బౌద్ధ ప్రవచనాల ఫలితమే . ఉత్తమ వైద్యుడు - ఎప్పుడూ కూడా తన వైద్యగ్రంధాన్ని - తన వైద్య పరికరాలను వెంట ఉంచుకొని ప్రయాణించాలని చెరకుడు అన్నాడు . బుద్ధ దాసుడు ఇది ఆచరించి - తనకు తటస్థ పడిన వారికి అక్కడికి అక్కడే వైద్యము చేస్తూ వుండే వాడు .

ఇక మరొక సింహళ రాజు Parakkama the Great ( 1164 } 100 పడకల ఆస్పత్రిని కట్టించి అన్ని మందులూ పరికరాలు ఏర్పాటు చేసాడు .ప్రతి రోగికీ ఒక స్త్రీ మరియూ పురుష సేవకుడిని ఇచ్చాడు . వైద్య శాస్త్రపు మేధావులకు అగ్రహారాలు వంటివి సమకూర్చాడు .

చివరికి ఏమిటంటే బౌధము తాను ప్రపంచ యాత్ర చేస్తూ - ఆయుర్వేదము చేత కూడా ప్రపంచ ప్రయాణము చేయించింది .బుద్ధిస్టులు ఏ ఏ దేశాలకు వెళ్లారో అక్కడ కల్లా ఆయుర్వేదము  వెళ్ళింది .

సేకరణ రచన వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .
**16**,ఆయుర్వేద  వైద్యము**-** కొన్ని విశేషాలు   21-06-24

సుశ్రుతుని ప్రకారము - సూద్రులు కూడా ఆయుర్వేద వైద్య విద్యను అభ్యసించ వచ్చు . అనగా చరక సంహిత - సుశ్రు సంహితలు చదవచ్చు . ఈ రొండు సంహితలలోనూ ,వేదపు శ్లోకాలు - వేదపు మంత్రాలూ వుంటాయని చెప్పుకున్నాము .సూద్రులు ఈ మంత్ర  భాగాలను తప్ప మిగతా సంహితను అంతా చదవ వచ్చునని సుశ్రుతుడు అనుమతి ఇచ్చాడు .

పై కారణం వల్ల బ్రాహ్మణులు చదివిన వైద్య శాస్త్రము - వేదబాహ్యులు అయిన వారు చదివిన వైద్య శాస్త్రము వేరు వేరు అయినాయి . బ్రాహ్మణుల కోసము వున్న ఆయుర్వేదాన్ని ఒరిజినల్ ఆయుర్వేద శాస్త్రము అని పశ్చాత్యులు వ్యవహరిస్తారు . దీనిలో బ్రాహ్మలకు మాత్రమే తెలిసిన  100    మించిన   విషయాలు /శ్లోకాలు ఉన్నాయి . ఇటువంటి పరిస్థితులలో కొందరు మేధావులు

ఆయుర్వేదంలో వున్న వేదం శ్లోకాలకు పద్య రూపం కల్పించి వాటిని  అందరికీ అందుబాటు లోకి తెచ్చారు  . ఇలాగే  మను ధర్మ శాస్త్రములో కూడా వేదపు శ్లోకాలు వున్నాయి . కాబట్టి, ఆ వేదపు  శ్లోకాలు కూడా అందరూ చదవకుండా ఉండేందుకు - అని - ఆ శ్లోకాలకి కూడా పద్య రూపాలు ఇచ్చారు .పద్యాలు రాసిన వారు తమ సొంత ఊహలను , ప్రాంతీయ పరిస్థితులను , జనసామాన్యం లో వున్నా నమ్మకాలను పద్యాలలోకి చొప్పించి రాసారు . ఇందువల్ల భారత దేశములోని మను ధర్మ శాస్త్రము - చరక సంహిత,  సుశ్రు సంహిత లాంటి గ్రంధాలు  - భారత దేశము అంతటా ఒకే రూపంగా ఉండక, చిన్నా పెద్దా మార్పులకు లోను అయ్యి ఉంటాయి .

సంహితల  లోనే కాక  విష్ణు పురాణములో కూడా వైద్యానికి సంభందించిన  సంగతులు కొన్ని వుండటాన ఇంగిలీషు వారు దీనిని 1840  లలో ఆంగ్లం లోకి అనువదించుకున్నారు .

( 1)   పర్షియన్లు శుశ్రుత సంహితతమAD  1500  లలో తమ భాష లోకి అనువదించుకున్నారు . అప్పటినుండీ శుశ్రుత సంహిత ప్రపంచ ఖ్యాతి పొందింది  (2) ఆయుర్వేదము మీద వేరే దేశాల ప్రభావము అనేది లేదు

ఇది అచ్చ భారతీయ వైద్యము . 03 .వైద్యుడు అంటే వైద్య విద్యను ప్రదర్శించే కళాకారుడు . సంగీత నృత్య కళాకారులు చప్పట్లను ఆశించినట్లు ఈయన కూడా చప్పట్లు, ప్రశంసలు ఆశిస్తాడుఅని రోగి గుర్తించాలి.

ఇక్కడితో - నేను రాస్తూ ఉన్న ప్రపంచ వైద్య చెరిత్ర-- అందులో హిందువుల పాత్ర -- అనే విభాగం పూర్తి అయ్యింది .ఇప్పటికి మొత్తము 16 వ్యాసాలు అయ్యాయి .డిజిటల్ బుక్ తయారు చేశాను , మీ వాట్స్ అప్ నెంబర్ కామెంట్ బాక్స్ లో ఇచ్చినట్లైతే ఆ డిజిటల్ బుక్కును మీకు ఫ్రీగా పంపుతాను .విషయాలు తెలుసుకోవాలి మరియూ ఇతరులకు తెలపాలి అన్న ధ్యేయంతో రాస్తూ వుంటాను . అన్ని వ్యాసాలు చదివి ఆదరించిన వారు వున్నారు - ఇదేమి దరిద్రము అని అభిప్రాయం పడ్డవారూ వున్నారు. అందరికీ నమస్కారాలు .ప్రపంచ వైద్య శాస్త్ర చెరిత్ర ఇంకా ఎంతో వున్నది . అదికూడా రాయ బడుతుంది .

ఇట్లు మీ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్
అమరావతి-9908482191